స్త్రీకి సంతానం సహజమైన కోరిక



# లోధ్ర



దానిని సఫలత నొందిస్తుంది ★

లోధ్ర అంతటా దొరుకును

కేసరికుటీరం లిమిటెడ్.
మదరాసు



ఒరిస్సా, నైజాము, ఆంధ్ర, తమిళజిల్లాలకు ఏజెంట్లు:
శ్రీ సీతారామ జనరల్‌స్టోర్సు, బరంపురం, సికింద్రాబాదు, బెజవాడ, మధుర.

మన్నికకు, అందానికి.

# ఇండియా సిరామిక్స్ లిమిటెడ్

నెల్లూరు - కాళహస్తి - మద్రాసు

# ఈస్ట్ అండ్ వెస్ట్

## ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్, బొంబాయి.

[1913 లో స్థాపితం]

ప్రధాన కార్యాలయం :

'ఈస్ట్ అండ్ వెస్ట్ బిల్డింగ్', ఫోర్టు, బొంబాయి.

34 సంవత్సరాలుగా దేశసేవచేస్తూ జాతీయోన్నతి పెంపొందిస్తూ ఉన్న ప్రముఖ భారతీయ భీమాసంస్థ.

ఆర్థికంగా సుస్థిరమై, పాలసీదార్లతోనూ, ఏజంట్లతోనూ వ్యవహరించుటలో సంస్కారానికి పేరెన్నికగన్న సంస్థ.

1944 లో జరిపిన అదనపువ్యాపారం కోటిరూపాయలు మించింది.

చురుకైనటువంటివీ, పలుకుబడి కలిగినటువంటివీ వ్యక్తులు ఏజన్సీలకొరకు దరఖాస్తులు పెట్టుకోవచ్చును.

వివరాలకు:

శ్రీ జె. యస్. రెడ్డి
బ్రాంచి సెక్రటరీ,
377, ఎస్ప్లనేడ్,
మద్రాసు.

★

శ్రీ వి. ఎ. నాగరెడ్డి
చీఫ్ ఏజంటు,
రాయల్‌సీమ ఏరియా,
విక్టోరియాపేట, ఆదోని.

శ్రీ యస్. మల్లికార్జునరావు, ఆర్గనైజింగ్ సెక్రటరీ, బెజవాడ.

---

KAKA BRAND SOAP

TRADE MARK REGD. NO.8381

காகா மார்க்கு சோப்

కాకా మార్కు సబ్బు

PALACE SOAP WORKS.
PROPS. M. R. SREERAMULU CHETTY & SONS
G. T. MADRAS

'కాకా' సబ్బును

ఎల్లప్పుడు వాడండి.

---

లైసెన్సు అవసరంలేదు !

## అమెరికన్ మాడల్ రివాల్వర్



మీ ప్రాణ, ధన, మానాలను
రక్షించుకొనుటకు

ఆరుగుండ్లు గల ఆటోమాటిక్ రివ్వాల్వింగు డిస్కుతో 15 ఔన్సుల బరువు. 9 అం॥ పొడవు గల ఈపిస్టలు గొప్ప శబ్దమును, నిప్పురవ్వలనూ వెలువరించును. నేడే ఆర్డరివ్వండి.

నెం. 222 రు. 6/8. ★ నెం. 333 రు. 7/8. ★ నెం. 444 రు. 8/8.

అదనంగా 4డజన్ల తోటాలు రు. 4/8. తోలుపటకా పిస్టలు కేసుతో ఒక్కొక్కటి రు. 5. పిస్టలు ఆయిలు సీసా రు. 1.

విల్సన్ ట్రేడింగ్ కార్పొరేషన్, పోస్టు బాక్సు 247, కాన్‌పూర్ (యు. పి.)



| విషయము | | | పేజి |
|---|---|---|---|
| రోకంటి పాటలు | ... | ... | 6 |
| గేయకథలు | ... | ... | 7 |
| కొంగా - కోతి | ... | ... | 10 |
| మాయకలం | ... | ... | 13 |
| అదృష్టవంతుడు | ... | ... | 17 |
| ముసలివాని తీర్పు | ... | ... | 20 |
| అప్పగింతలు | ... | ... | 21 |
| దోమమ్మ పెళ్లి | ... | ... | 24 |
| తండ్రి - కొడుకులు | ... | ... | 26 |
| అత్తా కోడళ్ల కథలు | ... | ... | 31 |
| బుజ్జమ్మ కథలు | ... | ... | 35 |
| మంగయ్య తెలివి | ... | ... | 37 |
| ఒంటె, నక్క, తోడేలు | ... | ... | 40 |
| తెనాలి రామలింగం | ... | ... | 45 |
| పోటీవ్యాసం | ... | ... | 49 |
| చందమామ పజిలు | ... | ... | 53 |

ఇంకా, ఇంకా, ఎన్నో !!!




సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 2 | ఫిబ్రవరి, 1948 | సంచిక 2

## పాపల్లారా!

సంక్రాంతి పండుగ సంతోషంగా గడిచిపోయింది. మీరంతా మంచి మంచి గుడ్డలు వేసుకుని, మంచిమంచి పిండివంటలు తిని, బీదలకు పెట్టిఉంటారు. కాని ఒక్క పండుగనాడేకాదు సుమా! ప్రతిరోజూ మీ చేతులో ఉన్నది బీదలకు పెడుతూ ఉండండి. అలాచేసిననాడే మీరు చాలా గొప్పవారు అవుతారు. మీకూ, మీ తల్లిదండ్రులకీ, మీ దేశానికీ పేరుతెస్తారు.

అన్నట్టు మీ చేతులో చందమామ కూడా బీద పిల్లలకి చదువుకోటానికి ఇవ్వండేం. ఇస్తారుకదూ?

# రోకంటి పాటలు

పాపాలు పుణ్యాలు పాలించు స్వామీ
పాపకర్ములబట్టి బంధించుస్వామీ.
పుణ్యమ్ము కొందరికి పూజకొందరికి
పునిస్త్రి జన్మాన చావుకొందరికి.
పుణ్యమ్ము పాపమ్ము ఒకవీధినుండె
పాలపండ్ల గంప మావీధినుండె.
అన్నెమ్ము పున్నెమ్ము ఒకవీధినుండె
అరటిపండ్ల గంప మావీధినుండె.
పాపకర్ముడి చేలో ఏమేమి పండు?
పాయకు పదిపుట్లు పల్లేళ్లు పండు.
కన్నవారిచేలో ఏమేమి పండు?
సకల ధాన్యంపండు సన్నవరి పండు.
సట్టింట సిరిచాప నామాలపెట్టె
నరసింహదాసుల్లు మాకన్నవారు.
నీర్కావి పంచెల్లు నిలువుటంగీలు
గోల్కొండ చౌదర్లు మాకన్నవారు.
తూర్పువీధినుండి మా ఎడ్లు రాగ
తులసెమ్మ కోటల్లె కొమ్ముల్లు విసరు.
పడమటి వీధినుండి మా ఎడ్లురాగ
పట్టు కుచ్చులల్లె తోకల్లు విసరు.

పుట్టింటి దీపంబు చల్లంగవుంటే
పున్నమా చంద్రుడికి పూజలూసేతు
అత్తింటి దీపంబు చల్లంగవుంటే
ఆదిశేషుడికి నేను హారతులుయిత్తు.
పొరుగు మంచిదని పోయి కూర్చుంటే
పోజూసి దెప్పితిరి పొరుగేమి పొరుగు
కాపరము చేసింది కల్లచేసింది
రెండేళ్ళలో యిల్లు గుల్లచేసింది.
కాకర చెట్టుకు పూత అందంబు
తల్లిబెట్టిన సొమ్ము బిడ్డ కందంబు
కాకర చెట్టుకు కాయ లందంబు
మా మాచెమ్మ తల్లికి కొడుకు లందంబు
కొడుకుల గలతల్లి మొగ్గల్లమోలు
కూతుళ్ళ గలతల్లి అమల్లమోలు
మంచినీళ్ళభావి మల్లెలాభావి
చేదుకో తమ్ముడా చెల్లెళ్ళభావి
అరటిపండ్ల అత్తమ్మ చేతబట్టుకుని
అక్కలా యిళ్ళేప నడుగు తమ్మూడా!
నాచేతి రోకళ్లు నల్ల రోకళ్లు
చేయించు తమ్ముడా చేపరోకళ్లు
వేయించు తమ్ముడా వెండి పొన్నుల్లు.

సంపాదన: ఈదర లక్ష్మీనారాయణ, తెనాలి.

# గేయ కథలు

ఏటుకూరి

పుల్లి విస్తరాకు లేచి — పోవుచుఃడగా
మట్టిగడ్డ దాని నాపి — మాటలాడింది.

## గాలి :: వాన

గడ్డ: గాలిగాణ్ణి చూస్తె నీకు
కంపమెత్తునా?
దొంగ విధవ నన్ను జూచి
తొలగిపోతాడు.

విస్తర: వానదేవు డంటె నీకు
వణకు పుట్టునా?
నన్ను జూచి నీరుగారి
తన్నుకొంటాడు.

గడ్డ: అట్టులైన నీవు నాకు
అండగుండాలె,
గాలివస్తె మీద కురికి
కదలనిస్తానా!

విస్తర: వానవస్తె నేను నిన్ను
వదలిపోతానా?
కప్పులాగు మీదవ్రాలి
కదలనిస్తానా?

గాలివాన కూడివస్తె
కథ గతేమిటీ?
తెల్పుడంటు పెంటపోగు
దెప్పిపొడిచింది.

ఇంతలోనె గాలి-వాన
ఎత్తుకొచ్చిందీ
విస్తరాకు లేచి రాజ
వీధి బడ్డాది.

మట్టిపెడ్డ గరగిపోయి
మాయమైనాది
గాలివాన కలిసివస్తె
కథె ముగుస్తుంది.

మంచి చెడ్డ లెఱుగనట్టి
మఃప లీలాగె,
ముందేమగునొ తెలిసికోక
ముచ్చటిస్తారు.

# లొట్టకన్ను

గంగులు కూతురి పెండ్లాయే
గమ్మత్తేమిటొ విన్నారా ?
పెండ్లి కుమారుం డొకనాడూ
పెండ్లముతో నిట్లన్నాడు.



పెండ్లికొడుకు

మోసము చేశా చూశావా ?
మూలము దెలిసికొన్నావా ?
గాజు కన్ననీ మీవారూ
గమనింపకనె నిన్నిచ్చారు !

పెండ్లికూతురు

ఏదేదీ చూపించండీ !
ఎందుకు కప్పెట్టారండీ ?
మీకంటే తరు గెవరండీ !
మేమొక పని చేశామండీ.

పెండ్లికొడుకు

అంత తెలివి మీకేడ్చిందా
అయితే చెప్పుడు చూతాము ?
కావలసిన చూ డంటూనే
కంటి లొట్ట చూపెట్టాడు.



# కట్టెకొలు



పెండ్లికూతురు

ఎట్టెకొర మరుకొన్నారా ?
లొట్టకన్ను చూపె-టారు ?
పట్టికి మూకం ఉంటూనే
కట్టకొలు చూపెట్టింది.

అంతటికీ,

నక్కిళ్ళయ్యాకు బడ్డాయూ
నాలుక వెళ్లా పెట్టాడు.
పెదికొమూంత నవ్వడీ
పెదవుఖ క్రిందికి విటీవింది.

అప్పుడు,
తలుపు చాటుగా దాసీదీ
తగిన శాస్తి జరిగిందండీ.
ఏమేమని యత్తకిగిదీ.
మా మేమేమో సణిగాడు.

శాడినెక్కువా డుంటేనూ
తలదన్నేవా డుంటాడు
పరులను మోసము చేస్తాః
పదిరెట్లనుభా విస్తారు.



ఈసారి కొంగ కోతిని ఒక చిన్న కాలవదగ్గిరికి తీసుకు వెళ్లింది. కాలవ మధ్య ఒక బండ వుంది..



మొదట కొంగ కాలవ ఇవతలిగట్టునించి మధ్య బండమీదకి దూకి అక్కణ్ణించి అవతలిగట్టుకు దూకింది. కోతినికూడా అలాగే దూకమంది.



కోతికూడా అలాగే దూకింది.



ఈసారి కొంగ యివతలిగట్టునించి అవతలిగట్టుకు
ఒక్కసారిగా దూకి కోతినికూడా అలా దూకమంది.



కోతి అలాగే దూకబోయింది కాని అవతలిగట్టు
చేరుకోకముందే బుడింగిమని కాలవలో పడ్డది.

## ఇంటి సౌభాగ్యం

ఇంటినిండ చిప్పలు
చెరువులోను కప్పలు
పిల్లులన్ని పెళ్లికెళ్లె
పిల్లల్ని కుక్క కరిచె
కుక్కలెల్ల మోరలెత్తి
చందమామను చూచి అరిచె
ఆ మామకు హడలెత్తి
అంతలోనె అస్తమించె
ఊరిలోను కాటకం
ఇంటిలోను నాటకం.

కళాప్రపూర్ణ డా॥ చి. నారాయణరావు

## 'సరిగమపదనిస' లతో సరిక్రొత్త పాట

*

సరి నీపని సరి
సరి నీపావపని సరి
సరి నీమామపని సరి
సరి నీదానివని సరి
సరి నీమగనిపని సరి
సరి నీపాగపని సరి
సరి నీసరిగపాగపని సరి
సరి నీపని సరి; మాపని సరి.

కూర్పు:
అమంచి అనసూయాబాయి,
తాడిమేటి సుగుణాదేవి, రాజోలు.

## చందమామ

చందమామ నాది,
చక్కెబెల్లం నాది!
చుక్కలన్నీ నావి,
సూర్యుడంత నాది!
పువ్వులన్నీ నావి,
పోకచెట్టు నాది!
చెట్టుచేమ నాది,
చేపజెల్ల నీది!
మిన్నుమన్ను నాది,
నీదేమీ లేదు పో!!!

సంపాదన:
తురిమెళ్ల ఇంద్రాణీదేవి, బళ్లారి.

## చిక్కు మాట

కూర్పు: తాతంభొట్ల పార్వతీదేవి, గుంటూరు.

*

అబ్బాయిలూ, అమ్మాయిలూ!

నేను ఐదు అక్షరాల పురాణ గ్రంధాన్ని. నేను
"భాగీరధి" లో వున్నాను
"తుంగభద్ర" లో వున్నాను
"గోదావరి" లో వున్నాను
"తపతి" లో వున్నాను
"యమున" లో వున్నాను

నేనెవరో చెప్పుకోండి?

(జవాబు ఈ సంచికలోనేవుంది)




# మాయ కలం

అనగా అనగా ఒకవూళ్లో చిట్టీ, పొట్టీ అని యిద్దరు పిల్లలు వుండేవాళ్లు. ఇద్దరూ అన్నదమ్ములు. చిట్టి చిన్నవాడు, పొట్టి పెద్దవాడు.

ఒకరోజున చిట్టీ, పొట్టీ బడినించి ఇంటికి తిరిగివచ్చారు. చిట్టి తన గదిలోకి వచ్చితలుపు దభేలునమూశాడు. పుస్తకాలు కోపంగా మూల గిరవాటేశాడు.

ఈ చప్పుడువిని పొట్టి గదిలోకివచ్చాడు. చిట్టికేసిచూస్తూ, "ఔను, తెలిసిందిలే. ఇవాళ మళ్లీ పంతులు నిన్ను కొట్టాడు కదూ?" అని అడిగాడు.

"అవునురా, పంతులువేసిన ఒక్క ప్రశ్నకీ జవాబు చెప్పలేకపోయాను. అన్నింటిలోనూ సున్నాలే వచ్చినై" అన్నాడు చిట్టి విచారంగా.

"తప్పంతానీదే. ఒకరోజైనా శ్రద్ధగా చదువుదామని ప్రయత్నించవు. మరి, సున్నాలుకాక యింకేమివస్తయ్" అన్నాడు పొట్టి గదమాయిస్తూ.

"పోరా, పో, నాకేమీ అక్కర్లేదు, పాడు చదువు! చక్కగా గూటీ బిళ్లా ఆడుకుంటాను. పాలాలమ్మటపోయి నేరేడు పళ్లు కోసుకుంటాను" అన్నాడు చిట్టి నిర్లక్ష్యంగా.

"అయితే, నీపని యిక నంతేలే, రోజూ పంతులు చేతులో దెబ్బలు తింటుందువు గాని" అంటూ పొట్టి బయటికి వచ్చేశాడు.

మర్నాడు మళ్లీ చిట్టి బళ్ళో దెబ్బలు తిన్నాడు. ఆవేళతిన్న దెబ్బలు యింటికి తిరిగివచ్చిన తర్వాతకూడా మరుపుకు రాలేదు. చిట్టి తనగదిలో కూచుని ఆలోచించడం మొదలుపెట్టాడు, "చదవకుండానే పంతులడిగే ప్రశ్నలకు జవాబు చెప్పటానికి ఏదైనా ఉపాయం దొరుకుతుందా?" అని.

అలా ఆలోచిస్తుండగా చిట్టికి చప్పున ఒక ఉపాయం తట్టింది - "ఆ వూళ్లోవున్న పేదరాసి పెద్దమ్మని అడిగితే ఏదో ఒక ఉపాయం తప్పకుండా చెబుతుంది" అని.

---

అనుసరణ : సూరంపూడి భాస్కరరావు, ఎం. ఏ.



సరే, ఈ ఆలోచనతో బయలుదేరి వెంటనే పేదరాసి పెద్దమ్మ యింటికి వచ్చాడు. వచ్చి, "పెద్దమ్మా, పెద్దమ్మా! చదవకుండానే,మాపంతులు వేసే ప్రశ్నలకి జవాబులు రాయటానికి నాకేదైనా చక్కటి ఉపాయం చెబుతావా?" అని అడిగాడు.

పెద్దమ్మ కాసేపు ఆలోచించి, "అలాగే, నాయనా, నేనొక మాయకలం యిస్తాను. నీపంతులు ఎంత కఠినమైన ప్రశ్నవేసినా సరే, అది నిమిషంలోకి రాసేస్తుంది. నువ్వు చదవాల్సిన పనేవుండదు" అని ఒక కలం తెచ్చియిచ్చింది.

కలం చూడటానికేమో మామూలు కలం మాదిరిగానేవుంది. చిట్టి ఆ కలం తీసుకుని, సంతోషంతో గూడ లెగరేసు కుంటూ యింటికి బయల్దేరాడు.

ఇంటికి వచ్చి రావడంతోటే, "ఒరే పొట్టీ, యిట రారా. నువ్వు నీ యిష్టమొచ్చిన ప్రశ్నవెయ్యి. నిమిషంలో జవాబు రాసి పారేస్తాను" అని కేక పెట్టాడు.

పొట్టి యిదివినగానే ఆశ్చర్యంతో ఒక్క పరుగున వచ్చాడు. "ఆమాత్రం తెలివే వుంటే రోజూ పంతులు చేతులో దెబ్బలు ఎందుకు తింటావు?" అన్నాడు పొట్టి.

"అదంతా నీకు అనవసరం. కావలిస్తే యిప్పుడే అడిగి చూడు. ఎవరు తెలివిగల వాళ్ళో తెలుస్తుంది" అన్నాడు చిట్టి గర్వంగా.

"సరే, నీ పుస్తకం తెచ్చుకో, రాద్దువు గాని" అన్నాడు పొట్టి.

చిట్టి పుస్తకంతెచ్చి, పెద్దమ్మ యిచ్చిన కలంపట్టుకుని టేబిలుదగ్గరకూర్చున్నాడు.

"ఆరూ, ఎనిమిదీ, తొమ్మిదీ, పదకొండూ కూడినచో మొత్తమెంత?" అని ప్రశ్న చదివాడు పొట్టి.

చిటికెలో రాసి కూడేసింది కలం. "ముప్పైనాలుగు" అని అరిచాడు చిట్టి, గర్వంగా పొట్టివేపుచూస్తూ.

పొట్టికి సంతోషంతోపాటు ఆశ్చర్యం కూడా వేసింది. "రైట్" అన్నాడు. ఇంకో లెక్క చెప్పాడుపొట్టి. నిమిషంలో చేసేసింది



కలం. "మరో లెక్క, మరో లెక్క" అంటూ పదిలెక్కలు చెప్పాడు పొట్టి. అన్నిటినీ కలం యిట్టే చేసేసింది. అప్పుడు పొట్టికి ఒక సందేహం కలిగింది.

"వీడు లెక్కలేచెయ్యగలడా, పాఠాల్లో ప్రశ్నలకికూడా జవాబు చెప్పగలడా?" అని. అందుకని, "కొంచెంసేపు జాగ్రఫీ పాఠంలో ప్రశ్నలువేసి చూస్తానుండు" అన్నాడు పొట్టి.

"ఓ, నీ యిష్టంవచ్చిన ప్రశ్నవెయ్యి. ఎందులోనైనాసరే" అన్నాడు పొట్టి.

అయితే "హిందూ దేశమును గూర్చి నీకు తెలిసిన దంతయు వ్రాయుము?" అని ప్రశ్న చదివాడు పొట్టి.

కలం వ్రాయడం మొదలుబెట్టింది. గబగబా బంతులు నిండిపోయాయి, పేజీలు నిండిపోయాయి, పుస్తకం నిండిపోతోంది. కలంమాత్రం యింకా వ్రాస్తూనేవుంది. పొట్టి చూస్తున్నాడు కలం నడకని. కలంతో పాటు చిట్టి చెయ్యికూడా వేగంగా నడుస్తోంది. పాపం, చిట్టికి చెయ్యి నొప్పిపుట్టింది. కాని కలంమాత్రం వ్రాయడం మానలేదు.

"అబ్బ, ఈవాల్టికి యిక చాలులేరా. రేపటినుంచీ చూసుకో స్కూల్లో నామహిమ" అన్నాడు చిట్టి వ్రాయడం చాలిద్దామని.



కాని, కలం ఆగితేనా! వ్రాసుకు పోతూ వుంది. కలం వ్రాయాల్సిన జవాబు పూర్తి కాలేదు. హిందూదేశాన్నిగురించి వ్రాయాలంటే మాటలా? అదీకాక అది మాయ కలంగనక దానికి అన్నీ తెలుసు. అందుకని అది ఆగకుండా వ్రాసుకుపోతోంది. పుస్తకం నిండిపోయింది, అందుకని టేబులుమీద వ్రాయడం మొదలెట్టింది. టేబులూ నిండిపోయింది; యిక నేలమీద రాయటం మొదలెట్టింది. నేలకూడా నిండిపోయింది గాని కలం రాయటం పూర్తి కాలేదు. అది గోడలమీద రాసుకుపోతోంది. కలంతోపాటు చిట్టి చెయ్యికూడా గబగబ గోడ అ చివరినించి ఈ చివరిదాకా

పరిగెడుతోంది, అఖరికి చిట్టికి ఏడుపుకూడా వచ్చింది. కలం తీద్దామంటే ఎంతకీ వూడిరాదు. చిట్టికి ఏమీ తోచలా. నొప్పి అంతకంతకీ ఎక్కువవుతోంది.

"ఒరేపొట్టీ, నువ్వైనాదీన్ని లాగివెయ్యరా బాబూ" అంటూ బావురుమన్నాడు చిట్టి.

పొట్టి కలం లాగుదామని ప్రయత్నిం చాడు కాని అదిరాలేదు. రాసుకుపోతూ వుంది. పాపం, తమ్ముడి అవస్థ చూసే సరికి పొట్టికి కూడా ఏడుపొచ్చింది. "ఎక్కడ దాపరించిందిరా ఈమాయదారి కలం నీకు?" అని అడిగాడు పొట్టి తమ్ముణ్ణి ఓదారుస్తూ.

"చదవకుండానే ప్రశ్నలకి జవాబులు రాసే ఉపాయం చెప్పమంటే మన పేద రాసి పెద్దమ్మ యిచ్చిందిరా!" అంటూ మళ్లీ బావురు మన్నాడు చిట్టి.

అప్పుడు గ్రహించాడు పొట్టి, ఇదంతా పెద్దమ్మ వేసిన ఎత్తేనని. "ఓ, అదా, సంగతి! శ్రద్ధగా చదువుకుంటా నంటే కలం మళ్లీ ఒదిలేస్తుందేమో?" అన్నాడు పొట్టి.

"ఇంతబాధ పడాలని తెలిస్తే అట్లాగే చదువు కుంటానని చెప్పేవాణ్ణిగా పెద్ద మ్మతో!" అన్నాడు చిట్టి, ఏడుపు దిగ మింగుతూ.

చిట్టి ఈమాటలు అంటుండగానే, "అదీ, అలా దారికిరా. శ్రద్ధగా చదువు కుంటే ఎంతమంచిదో యిప్పుడైనా తెలి సిందా?" అంటూ ప్రవేశించింది పేద రాసి పెద్దమ్మ. చిట్టీ, పొట్టీ ఏడుపు చూసే సరికి పెద్దమ్మకు జాలివేసింది. "ఇక చాల్లే" అంటూ పెద్దమ్మ కలంమీదచెయ్యి వేసింది. కలం కాస్తా వూడి వచ్చేసింది.

అప్పుడు పెద్దమ్మ యిలాఅంది- "ఇది యిక మామూలు కలమే. ఇవ్వాళనువ్వు పడ్డబాధకిగాను దీన్నినీకు బహుమానంగా యిస్తున్నాను. చాలా బాగా రాస్తుంది. ఇక నించి అయినా నువ్వు శ్రద్ధగా చదువుకో. బళ్లో ఈకలంతోటే వ్రాయి. ఒకవేళనువ్వు దాన్ని పారేద్దామని మనసులో అనుకున్నా వంటే మళ్లీ అంటుకుంటుంది. మళ్ళీ యిలాగే బాధపడతావు" అని.

అంతటితో చిట్టికి బుద్ధివచ్చింది. ఆరోజు మొదలుపాఠాలుశ్రద్ధగాచదవటం మొదలు పెట్టాడు. మర్నాడునించీ చిట్టికి బళ్ళో అన్నిటిలోనూ ఫస్టు మార్కులే!



# అదృష్టవంతుడు

చాలా కాలం క్రితం ఒకవూళ్లో ఒక బీద బ్రాహ్మడుండేవాడు. ఆయన ఇంటింటికీ తిరిగి యాయవారంచేసి ఓ కుంచెడు బియ్యం తెచ్చేవాడు ప్రతి రోజూను. ఆ తెచ్చిన బియ్యంలో సరిగ్గా సోలెడు బియ్యం మాత్రం అత్తెసరువేసి భర్తకు అది అంతా పెట్టేస్తూండేది భార్య.

అది చూచి అ బ్రాహ్మడు "అయ్యో! అంతా నాకే పెట్టేశావు! నీకోనే" అని అడిగేవాడు భార్యని. "నాకెందుకు! నా రొట్టె పొయ్యిలోనే ఉంది" అని ఆమె జవాబు చెబుతుండేది. భోజనమైనాచెయ్యాక బియ్యం అమ్మి డబ్బు మూటకడుతోంది తన పెళ్లాం అని సంతోషించేవాడు. భర్త భోజనంచేసి వెళ్లగానే ఆ ఉన్న బియ్యమన్నీ పిండి విసురుకొని పొయ్యిలో రొట్టె కాల్చుకు హాయిగాతినేది ఆ యిల్లాలు. ఈ సంగతి పాపం అ బ్రాహ్మడికేం తెలుసు?

ఓ రోజున ఈ బ్రాహ్మడు భోజనంచేసి వీధిలోకివెళ్లాడు. ఆ ఇల్లాలు రొట్టె పొయ్యిలో కాల్చుకుంటూంది. ఇంతలో చినుకులు వచ్చాయి. ఆ చినుకుల్లో తడిసి బ్రాహ్మడు ఇంటికివచ్చాడు. కప్పుకున్న దుప్పటి తడిసిపోయింది. కొంచెం చలివేసింది. చలి తగ్గేలా కాచుకుందామని పొయ్యిదగ్గరకు వెళ్లి నిప్పులు బయటకులాగాడు. వెంటనే ఒక పెద్ద రొట్టెముక్క బయటపడింది. అప్పుడర్థమయింది ఆ వెఱ్ఱిబ్రాహ్మడికి భార్య చేస్తున్న పని. ఇంతట్లోకే ఆ ఇల్లాలు వచ్చి తన రహస్యం భర్త కనిపెట్టినందుకు చాలా కోపం తెచ్చుకుంది. కసిరింది. తిట్టింది. ఇంక అతనితో కాపరం చెయ్యకూడదనుకుంది. అలాటి మొగుడు బ్రతకడం కూడా ఆమెకి ఇష్టం లేకపోయింది.

ద్విభాష్యం పుల్లసరోజిని, దుర్గాడ.





ఆలోచించి తన భర్త గట్టి వైద్యుడనీ, తప్పకుండా ఆ వ్యాధి కుదుర్చగలడనీ, కాని తానువెళ్లమంటే వెళ్లడంలేదనీ రాజుగారికి తెలియచేసింది. రాజుగారు భటుల్ని పంపి బలవంతాన తీసుకువెళ్లారు బ్రాహ్మణ్ణి.

రాజుగారమ్మాయి ఓ గదిలో ఉంది. మూలుగుతూ బాధపడుతూ ఉంది. ఈ బ్రాహ్మడు గదిలోనికి వెళ్లి రాజుగారి అమ్మాయిని చూచాడు. ఏమి చెయ్యాలో పాలుపోలేదు. ఆ అమ్మాయి పడుకున్న మంచం ప్రక్కగా ఓ కుర్చీ ఉంది. దాన్లో కూర్చున్నాడు. తన కెలాగా చావు తప్పదని నిశ్చయించుకున్నాడు. ఆ గది తలుపు చేరవేశాడు. తన దురదృష్టాన్ని తిట్టుకుంటూ ఇలా పాడడం మొదలుపెట్టాడు.

"చిటపట చినుకులు రానేలా ?
పైమీద దుప్పటి తడవనేలా ?
పొయ్యిలో నిప్పులు తియ్యనేలా ?
నాకింత కర్మం రానేలా ? "

ఇలావుండగా ఆ వూరు రాజుగారి అమ్మాయికి కంఠంలో పెద్ద కురుపు లేచింది. ఎంతమందో వైద్యులు వస్తున్నారు. వెడుతున్నారు. కాని కురుపు తగ్గలేదు. వచ్చినవైద్యుడు జబ్బు నయం చేయకుండావెడితే తలనరికి కోట గుమ్మానికి కట్టేస్తాననీ, తగ్గిస్తే అర్ధరాజ్యం ఇస్తాననీ రాజుగారు చాటించారు.

ఈ సంగతి బ్రాహ్మడి పెళ్లాం విన్నది. ఏదో వంకపెట్టి రాజుగారింటికి తన భర్తను తోసేసి వైద్యం చెయ్యమంటే చాలు. చచ్చిపోడానికి మంచిమార్గం అని



ఆ పాట విని రాజుగారి అమ్మాయి మూలగడం మాని అతనివైపు చూసింది. అతనలా రెండుసార్లు మూడుసార్లు ఆ పాట పాడి ఏడవడం మొదలుపెట్టాడు. వైద్యం చెయ్యడానికివచ్చి ఈ పాటలు ఏమిటి? ఈ ఏడుపేమిటి? అని అనుకుంటూ ఫక్కున నవ్వింది. అలా నవ్వి యెన్నాళ్లయిందో? గట్టిగా నవ్వగానే కంఠంలోని కురుపు కాస్తా ఒక్కమాటుగా చితికిపోయి ఆ కుళ్లు పదార్థం అంతా బయటకు వచ్చేసింది. అతి ఆనందంతో 'అమ్మా! నాన్నా!' అని పిలవడం మొదలుపెట్టింది. ఆ పిలుపు విని రాజుగారూ రాణిగారూ పరుగెత్తుకుంటూ వచ్చారు. కూతుర్ని చూసి ఆశ్చర్యపోయారు. ఎవ్వరూ తగ్గించలేని ఆ కురుపు తగ్గించినందుకు ఆ బ్రాహ్మణ్ణి చాల మెచ్చుకుని అందలంమీద ఊరేగించి అర్ధరాజ్యం ఇచ్చి పట్టాభిషేకం చేశారు.



బ్రాహ్మడిపెళ్లాం రాణీ అయింది. సిగ్గు తెచ్చుకుంది. భర్తను చాలా గౌరవముగా చూచేది. ఇంతకీ రాజ్యం రావడానికి రొట్టె కారణమని ఆవిడా, పాట కారణమని ఆయనా అప్పుడప్పుడు వాదించుకుంటూ హాయిగా రాజ్యం చేస్తున్నారు. అదృష్టం ఉంటే ఎంతసేపు?



# ముసలివాని తీర్పు

అనగా అనగా ఓవూళ్ళో రామూ, సోమూ అని యిద్దరు స్నేహితులుండేవాళ్లు. ఒక రోజున వాళ్లిద్దరూ ఒక దూరప్రయాణానికి బయలుదేరారు. ఆరోజుల్లో యిప్పటిలాగా బళ్లు, కార్లు, రైళ్ళూ లేవుగా ? అందుచేత యిద్దరూ కాలినడకని బయలుదేరారు.

త్రోవలో తిందామని రామూ మూడు రొట్టెలు, సోమూ అయిదు రొట్టెలు తెచ్చుకున్నారు.

సగందూరం వచ్చేసరికి వాళ్లిద్దరికీ ఆకలివేసింది. ఆ ప్రక్కనే ఒక చెరువు కనిపించింది. ఇద్దరూ చెరువు ఒడ్డున రొట్టెలు తిందామని కూచున్నారు. ఇంతలో ఒక బాటసారి అటుపోతూ, వాళ్లదగ్గిరికి వచ్చి "బాబూ, ఆకలి జాస్తిగావుంది. నాకు కూడా కాస్త పెడతారా?" అని అడిగాడు.

బాటసారిని చూసేసరికి యిద్దరికీ జాలి కలిగింది. వాళ్ళదగ్గరున్న ఎనిమిది రొట్టెలూ ముగ్గురూ సమంగా పంచుకు తిన్నారు.

బాటసారి వాళ్లిద్దరికీకలిపి ఎనిమిది అణాలుయిచ్చి తనదారిన వెళ్లిపోయాడు.

అప్పుడు సోమూ అన్నాడు- "రామూ, నావి అయిదురొట్టెలు గనక నేను అయిదు అణాలు తీసుకుంటాను. నీవి మూడు రొట్టెలుగనక మూడుఅణాలు తీసుకో" అని.

రామూ ఒప్పుకోలేదు-"అదేం కుదరదు. ఇద్దరం చెరిసగంపంచుకోవాలి." అన్నాడు.

ఇందుకు సోమూ ఒప్పుకోలేదు. అందువల్ల యిద్దరూ తగువులాడసాగారు.

ఇంతలో ఆ దారిన ఒక ముసలివాడు పోతూ వాళ్లపోట్లాటచూచి దగ్గిరికివచ్చాడు. రామూ, సోమూ తమపోట్లాటకి కారణమేమిటో చెప్పారు.

అప్పుడు ముసలివాడు "మీరు నే చెప్పినట్లు చేస్తారా? న్యాయంగా పంచుతాను" అనిఅడిగాడు. రామూసోమూ ఒప్పుకున్నారు.

ముసలివాడు అడిగాడు - "ఎనిమిది రొట్టెలూ ముగ్గురూ సమంగా తిన్నారు గదా?" అని. "అవు"నన్నారు వాళ్లిద్దరూ.

"అయితే, సోమూతెచ్చిన ఐదు రొట్టెలు పదిహేను ముక్కలు అయాయి. రామూ తెచ్చిన మూడురొట్టెలు తొమ్మిది ముక్కలు అయినాయి. సోమూ తన పదిహేనుముక్కలలో తను ఎనిమిది తిని బాటసారికి ఏడు ముక్కలు యిచ్చాడన్నమాట. అందుకని సోమూకు ఏడు అణాలు వస్తయ్. రామూ తన తొమ్మిదిముక్కల్లో తను ఎనిమిది తిని ఒకముక్క బాటసారి కిచ్చాడన్నమాట. అందుకని రామూకి ఒక అణా వస్తుంది" అని ముసలివాడు తీర్పు చెప్పాడు.

ఆ తీర్పువిని రామూ తన తెలివితక్కువకు సిగ్గుపడ్డాడు. "చెరిసగం పంచుకుంటేనే బాగుండేదే!" అని విచారించాడు.

ఈదర రాధ, అయితానగర్, తెనాలి.




మొన్న నీ మధ్యనే మా బంధువుల యింట్లో పెళ్లి జరిగింది. నలుగురితోపాటు మాకూ శుభలేఖ వచ్చింది. సరిగ్గా నాకు అప్పటికి యింక నాలుగురోజుల్లో పరీక్షలు ప్రారంభమౌతై. కాని మా అమ్మ అప్పుడప్పుడు ఆ పెళ్లి కాబోయే పిల్లతల్లి మహా గయ్యాళిది అని చెబుతుండేది. అందుచేత ఆ గయ్యాళితనం ఏమిటో చూడాలని నాకు చాలా తొందర కలిగింది.

ఎలాగైతేనేమి, మా అమ్మా నాన్నా ఒప్పుకునేదాకా వేధించి వాళ్లతో కూడా నేనూ ఆ పెళ్లికి వెళ్లాను. మేము ఎక్కిన కారు దారిలో చెడిపోయింది. అది తిరిగి బాగై మేము పెళ్లివారిల్లు చేరుకునేసరికి పెళ్లి పూర్తిఅయిపోయింది. ఆ యిల్లాలు తన కూతుర్ని అత్తవారింటికి అంపకాలు చేసేముందు కూతురికి బుద్ధులు చెప్పతున్నది.

"మగనితో నీ కసలు మైత్రి సరిపడక
పగదానివలె నీవు పడజూడెతల్లి!"

తర్వాత, అత్తమామలకు :—

"అత్తమామలతోటి అనువుగాకుంటే
క్రొత్త ముగ్గులుపెట్టి కుంగ దియ్యావే!"

తర్వాత, చుట్టాలకు :—

"సేవ చెయించుకో చిన్నత్తచేత
బావగారిని నీదు బానిసగ చూడు!
మఱదుల నట్టిట్టు మన్నించబోకు,
ఇరుగుపొరుగులతోటి ఇచ్చకములాడు!"

ఆ తర్వాత కూతుర్ని ముందుబెటుకొని గుడ్ల నీళ్లు కుక్కుకుంటూ ఈ విధంగా బుద్ధులు చెప్పింది :—

"అంపకములనాడు అడుగవచ్చితె
కొంప గదలకనీవు కోపించుకోవె!
పెద్దలు నిన్నొచ్చి పిలువజూచితె
పెద్దపెట్టున గోల పెట్టి యాటాడు!
ఏకువలె మెత్తంగ ఎఱుగనట్లుండి
మేకువలె బిగిసికొని మేలుకొనియుండు!
కయ్యంబులకుముందుకాలుదువ్వాచు
పొయ్యికడకే పోక బుద్ధి గలిగుండు!"

ఎ. వి. గోపాలం, తాడేపల్లిగూడెం.



ఈ అప్పగింతలు వింటుంటే పాపం ఆ పెళ్లికొడుక్కి అరికాలిమంట నెత్తికెక్కింది. కాని ఏమనుకున్నాడో ఏమోగాని నోరు మెదల్చలేదు. "నేనేగనక పెళ్లికొడుకునైవుంటేనా..."అని ఏమేమో ఉద్రేకం కలిగిందినాకు, ఆ గయ్యాళిగంప చదివిన అంపకాలకి. పెళ్లికొడుకు పట్టి దద్దమ్మ అనిపించిందినాకు. సరే ఈవిధంగా అప్పగింతలు జరిగిన తర్వాత మగపెళ్లివారు, వారితోపాటు మేమూ తిరిగి యిళ్ళకు చేరుకున్నాము.

కొంతకాలం గడిచింది. మొన్న సంక్రాంతికి అల్లుడ్ని రమ్మని మామగారు వ్రాశారట. సరే అతను వెళ్లాడు. ఆరోజు రాత్రి భోజనాలదగ్గిర ఏంజరిగిందో తెలుసా?

అల్లుడొచ్చాడని మరినాలుగు రకాల పిండివంటలు చేసింది అత్తగారు. వడ్డన అంతా పూర్తిఅయింది. అంతావచ్చి విస్తళ్ళ ముందు కూర్చున్నారు. అల్లుడుమాత్రం వంటింటి మండిగంమీద కూలబడ్డాడు. అత్తగారువచ్చి "లే, నాయనా, కాళ్లుకడుక్కురా, వడ్డన అయింది" అని చెంబుతో నీళ్లుతెచ్చియిచ్చింది. కాని అల్లుడు లేస్తేనా! విస్తళ్ళవంకచూస్తూ "అదివేస్తేనేగాని నేను భోజనానికి లేవనండీ, అత్తయ్యా!"అన్నాడు.

పాపం, అత్తగారు గాభరాపడిపోయింది; 'అన్నీ వడ్డించానా, లేదా?' అని. విస్తరి వంక తేరిపార జూసింది. చేసిన పదార్థాలన్నీ, అందరితోపాటు అల్లుడి విస్తట్లోనూ వడ్డించివున్నై. ఇంకా, "అదివేస్తేనేగాని భోజనానికి లేవనంటాడు! అది ఏమిటబ్బా?" అని తీవ్రంగా ఆలోచించింది.

అల్లుడికి పులిహోర అంటె యిష్టమని ఆమె ఎప్పుడో మాటల సందర్భంలో విన్నదట. కాని ఆ రోజు పులిహోర చెయ్యలేదు. "బహుశా అదేనేమో, ఖర్మ" అనుకుని వంటింట్లోకి వెళ్లి కాసేపట్లో పులిహోర తయారుచేసితెచ్చి అందరి విస్తళ్ళల్లో వడ్డించింది. మళ్లీవచ్చి, "యిక లే, నాయనా, పొద్దుబోతోంది" అన్నది అల్లుడితో. కాని అల్లుడు లేస్తేనా! " 'అది' వేస్తేనేగాని లేవనండీ, అత్తయ్యా!" అన్నాడు.

పాపం, మామగారూ, బావమఱదులూ అంతావచ్చి బ్రతిమాలారు. కాని అల్లుడు అదేపాఠం వల్లెవేస్తూ కూచున్నాడు, " 'అది' వేస్తేనేగాని లేవను!" అని. ఇది చూసేసరికి అందరికీ మతి పోయినట్లయింది. ఒకవేళ అల్లుడికి దెయ్యం, గియ్యం పట్టిందేమో ననికూడా గాభరా పడ్డారు. అంత గయ్యాళి అత్తగారుకూడా, అల్లుడి తరహా



చూచి ఏడుపులు పెడబొబ్బలు మొదలెట్టింది. ఆవిడ వెంటనే యింటిల్లిపాదీ శోకాలు మొదలెట్టారు. ఈ గందరగోళం విని యిరుగు పొరుగువారుకూడా వచ్చారు, ఏమి కొంప మునుగుతోందోనని. అల్లుడు మాత్రం బెల్లంకొట్టిన రాయిలాగా మెదలకుండా కూచున్నాడు.

ఆ గయ్యాళిఅత్తగారు చివరికి అల్లుడి కాళ్లమీదపడి, గడ్డం పుచ్చుకు బ్రతిమిలాడటం మొదలెట్టింది. "ఎందుకు నాయినా, మమ్మల్నిలా ఏడిపిస్తావు? 'అ ది' వేస్తేగాని లేవనంటావు! ఆ 'అది' ఏమిటో కాస్త చెప్పు బాబూ " అని.

అప్పటికి అల్లుడికి కాస్త జాలి కలిగింది. "అదేమిటండి అత్తయ్యా అలా అంటావు? మిమ్మల్ని నే నేం ఏడిపించాను. 'అది' అంటే 'ఆకలి'. 'అది' వేస్తేనేగాని భోజనానికి లేవనన్నాను. అంటే, ఆకలి వేస్తేనేగాని భోజనానికి లేవనన్నాను. ఇందులో తప్పు సంగతి ఏ ముందని అలా యింటిల్లిపాదీ ఘొరుమంటున్నారు?" అన్నాడు.

చూడవచ్చిన అమ్మలక్కలు అంతా యిది వినేసరికి పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుకుంటూ 'ఇదిఅంతా ఆవేళ అప్పగింతల మహత్యం లేవమ్మా' అని ఒకరూ, 'మన గయ్యాళిగంపకి తగిన అల్లుడేనమ్మా' అని మరొకరూ, ఎవరికి తోచినట్లు వాళ్లు చెప్పుకుంటూ వెళ్లిపోయారు.

ఈ సంగతి మొన్న నాకు తెలిసిన తర్వాత, ఆ అల్లుడు వట్టి దదమ్మ అని నేను ఇదివరకు అనుకున్న అభిప్రాయం తప్పని తెలుసుకున్నాను.



# దోమమ్మ పెళ్లి





**అనగా** అనగా ఒకవూరు. ఆ ఊళ్లో ఒక **దోమ.** ఒక రోజున దానికి పెళ్లి చేసుకోవాలని బుద్ధిపుట్టింది. అది చిర్ర బుర్ర చిక్కు దీసుకుని, చీమిడి మెరుగు పెట్టుకుని, **పుటికనిండ** పూరీలు, అటికనిండ ఆవు నెయ్యి తీసుకుని కంచికి పోయి మంచి మొగుణ్ణి తెచ్చుకుందామని బయలు దేరింది.

దోవలో ఒక ఏనుగ దోమమ్మను కలుసుకుని, "దోమా, దోమా, ఎక్కడికి ప్రయాణం?" అని అడిగింది.

"కంచికిపోయి మంచి మొగుణ్ణి తెచ్చుకుందామని పోతున్నాను" అన్నది దోమ.

"ఏం, నన్ను పెళ్లాడరాదా?" అన్నది ఏనుగు.

"ఛీ, ఛీ! ఏనుగకు ఎత్తుచెవులు. నేను చేసుకోను" అంటూ దోమమ్మ ముందుకు సాగింది.

మరి కొంత దూరం పోయేసరికి, ఒక గుఱ్ఱము కనపడి, "దోమా, దోమా, ఎందాక ప్రయాణం" అని అడిగింది.

"కంచికిపోయి మంచి



మొగుణ్ణి తెచ్చుకుందామని పోతున్నాను" అన్నది దోమ.

"నన్ను పెళ్లి చేసుకోరాదా?" అన్నది గుఱ్ఱం.

"ఛీ, ఛీ! గుఱ్ఱానికి గుదికాళ్లు! నేను చేసుకోను" అంటూ దోమ మళ్లీ తన దారిన బయలుదేరి పోతూంది.

మరి కొంచెం దూరం పోయేసరికి ఒక పాము కనిపించి, "దోమా, దోమా, ఎక్కడికి ప్రయాణం?" అని అడిగింది.

"కంచికిపోయి మంచి మొగుణ్ణి తెచ్చుకుందామనిపోతున్నా" అందిదోమ.

"నన్ను పెళ్లి చేసుకోరాదా?" అన్నది పాము.

"ఛీ, ఛీ! పాముకు పడిగతల! నేను చేసుకోను" అంటూ దోమ ముందుకు సాగింది.

మరి కాస్త దూరం పొయ్యేసరికి ఒక కోతి కనిపించింది. "దోమమ్మా, దోమమ్మా! ఎందాక ప్రయాణం?" అని అడిగింది.

టి. నాగరాజు - మద్రాసు.



"కంచికి పోయి మంచి మొగుణ్ణి తెచ్చుకుందా మనిపోతున్నా" అందిదోమ.

"ఇదేగదా కంచి. నా కంటే మంచి మొగుడు నీకు ఎక్కడ దొరుకుతాడు. నన్ను చేసుకో రాదా ?" అన్నది కోతి.

"ఇదేనా కంచి! అయితే నిన్నే చేసుకుంటా లే" అన్నది దోమ.

కోతి దోమని నెత్తిమీద ఎక్కించుకుని ఇంటికి వచ్చి, దోమమ్మ తెచ్చిన పుటిక పూరీలు, అటిక అవునెయ్యి పెట్టి విందు చేసుకుని వైభవంగా పెళ్లి చేసుకుంది.

కొన్నిరోజులు గడిచినై. దోమమ్మ ఒక కొడుకును కన్నది. ఒకరోజున కొడుకును ఉయ్యాల తొట్లో పడుకోబెట్టి దోమమ్మ యిలా జోల పాట పాడింది:

" ఏనుగనువద్దంటి
ఎత్తు చెవులంటి
గుఱ్ఱమును వద్దంటి
గుదికాళ్లదంటి
పామును వద్దంటి
పడిగతలదంటి
కోతిని పెండ్లాడి
కొడుకునుగంటి
జో.... జో...."



ఇలా పాడుతుండగా మేతకుపోయిన కోతి యింటికి తిరిగివచ్చింది. పెళ్లాంపాట వినేసరికి కోతికి ఎక్కడలేని సంతోషమూ వచ్చింది. సంతోషం పట్టలేక అమాంతంగా వచ్చి దోమమ్మని ముద్దు



బెట్టుకుంది. అలా ముద్దు బెట్టుకోటంలో దోమమ్మ కాస్తా కోతి ముక్కులో దూరింది. పాపం, కోతి ఏంజేస్తుంది ?

"నీకు కాసులదండ యిస్తా, రా,
కట్టైవంకలు పెడతా, రా,
ముక్కుపోగు కుట్టిస్తా, రా,"

అని ఎంతో బ్రతిమాలింది. కాని దోమమ్మ బయటికి రాలా. కోతికి కోపంవచ్చి ముక్కు నలుపుకునేప్పటికి దోమమ్మ కాస్తా నలిగి చచ్చిపోయింది. దాంతో కోతికి తుమ్ము వచ్చి 'అచ్ఛ్' అని తుమ్మింది. ఆ తుమ్ముతో చచ్చిన దోమమ్మ కోతి ముక్కులోంచి కిందపడింది.

పాపం కోతి చేసేదిలేక కళ్ల నీళ్లెట్టుకుంది. అంతటితో కథ కంచి కెళ్లింది. మనం యింటికివచ్చాం.



# తండ్రి కొడుకులు



[గతసంచిక తరువాయి]

పగలల్లా సత్యం గదిలో కూర్చుని తలుపు బిడాయించుకున్నాడు. ఎవరో డబ్బు బదులు కావాలని వచ్చారు. వాళ్లెవరోకూడా తెలియకుండా వంటలక్క చేతికి పదిరూపాయలిచ్చి వాళ్లకిమ్మన్నాడు. మరెవరోవచ్చి తమకు సూరయ్య ఇరవై రూపాయలు బాకీ ఉన్నాడని చెప్పారు. ఆ డబ్బుకూడా ఇచ్చిపంపాడు. ఇంకెవరో చిన్న వ్యవహారం మాట్లాడాలని వచ్చారు. సత్యం బయటికి రాలేదు.

ఇదంతా సత్యానికి ఇరకాటంగానే ఉంది. కాని ఇంతకన్నా అతనికి భయం వేసిన దేమంటే వంటలక్కకీ, ఇంటో నౌకర్లకీ తననిగురించి అనుమానం కలగ సాగింది. వంటలక్క తనకేసి అదో మోస్తరుగా చూస్తోంది. తాను సూరయ్య కాదని ఎవరూ అనుకోరనే ధైర్యంతో ఉంటూవచ్చాడు సత్యం. కాని ఆ ధైర్యం ఇప్పుడు దిగజారసాగింది. తన మాటల లోనూ చేతలలోనూ తన లక్షణాలుండక ఏమవుతుంది? అనుమానం కలగనే కూడదుగాని కలిగితే అది క్షణంలోకి నమ్మకంగా మారుతుంది. ఈ మార్పు అచ్చగా తనలోనే అయితే అంత ఇబ్బంది లేకపోను. తన తండ్రి కాస్తకూడా తన మాదిరిగా ప్రవర్తించటంలేదు. మొదట లేదుగాని, ఇప్పుడిప్పుడు తండ్రిని చూడ గానే ఆయన మొహం చప్పున పోల్చుకోవ టానికి వీలవుతున్నది. ఎనిమిది తొమ్మిదేళ్ల లేత మొహంలో ఎక్కడో యాభై ఏళ్లవాడి ఛాయలున్నాయి. అద్దంలో చూసుకుంటే తన మొహంలోకూడా కుర్ర లక్షణాలు కనిపిస్తున్నాయి. ఈ లక్షణాలు పైవాళ్లు మటుకు చూడరా? వంటలక్క చూసే ఉండాలి!

పొద్దూకింది. చీకటిపడింది. కాని సత్యం బయటికి రావటానికి సాహసించలేదు. తన తండ్రికోసం, రాత్రి తొమ్మిదింటికికూడా ఎవరో ఒకరు వస్తూ ఉంటారు.

ఎనిమిది గంటలవేళకు వంటలక్క పైకివచ్చి "బాబూ, అబ్బాయిజాడలేదు," అని చెప్పింది.

"బళ్లోనుంచి తిరిగి రాలేదా?" అన్నాడు సత్యం.



"సాయంకాలం బడికి పోనే లేదు. ఎక్కడికైనా ఆడుకోబోయినా డనుకున్నా," అన్నది వంటలక్క.

"అదేమిటి? కోప్పడి బడికి పంపక పోయినావా?" అన్నాడు సత్యం.

"ఇప్పుడు అబ్బాయిని కోప్పడేట్టుగా లేదు. వెనకటి అబ్బాయి కాదు. మిమ్మల్ని కోప్పడమన్నా కోప్పడతానుగాని అబ్బాయి కేసి చూడటానికే భయంగా ఉంది," అన్నది వంటలక్క.

సత్యం అనుకున్నంతా అవుతోంది. ఇక నిజం ఎంతోకాలం దాగదు!

"ఏమైనాడో?" అన్నాడు సత్యం. తన తండ్రి ఏదో ఉపాయంచేసి ప్రపంచానికి నిజం చెప్పేస్తాడని భయపడుతూ సత్యం ఈ మాట అన్నాడు.

"అబ్బాయికొచ్చిన భయ మేమీ లేదు. మీరు వచ్చి భోంచెయ్యండి," అన్నది వంటలక్క.

"నే నిప్పుడు రాను. ఇంకాస్త ఆగి తింటా," అన్నాడు సత్యం.

"ఇంకా నయం. అన్నం తిన్నతరవాత రెండుగంటలన్నా మేలుకుని ఉండాలని వైద్యుడు చెప్పలా? పెందలాడే రెండు మెతుకులు తినండి. అసలే జబ్బువాళ్లు" అని వంటలక్క వెళ్లిపోయింది.

సత్యం మారుమాట లేకుండా వెళ్లి భోంచేశాడు. భోజనంచేసి చెయ్యి కడు



క్కుని హాలులోకి వస్తుండగా, "ఏంరోయ్, సూరయ్యా?" అంటూ ఒక పెద్దమనిషి వచ్చాడు. ఆయన్ని చూడగానే సత్యం పైప్రాణాలు పైనే పోయాయి. ఎందుచేత నంటే, ఈ వచ్చినాయన ప్లీడరు. తన తండ్రికి బాల్యస్నేహితుడు. తండ్రి కోర్టు వ్యవహారాలన్నీ చూస్తూ ఉంటాడు. తరుచు రాడుగాని వచ్చినప్పుడల్లా ఎవరికీ అర్థం గానివిషయాలు మాట్లాడి పోతూ ఉంటాడు. తన తండ్రి ఏపని ఉన్నా మానుకుని ఈయనతో మాట్లాడతాడు.

పరంధామయ్యగారు స్వతంత్రంగా సత్యంవెంట పైకి వచ్చాడు. కుర్చీలో కూర్చుని ఏమిటేమిటో మాట్లాడాడు. అంతా కోర్టువ్యవహారమే. సత్యానికి ఒకటే



అర్థమయింది. రేపు కోర్టు వాయిదా. సూరయ్య సాక్ష్యం. అతి ముఖ్యమైన సాక్ష్యం. ఏ ప్రశ్నలకు ఏ సమాధానా లివ్వాలో పరంధామయ్య చాలా సేపు చెప్పాడు. ఒక్కటీ సత్యం బుర్రలో ఎక్క లేదు. రేపు తాను కోర్టుకు ఎట్లావెళ్లటమా, వెళ్ల కుండా ఎట్లా తప్పించుకోవటమా అని ఆలోచిస్తు న్నాడు.

పదిగంటలదాకా కూర్చుని పరంధామయ్య వెళ్లిపోయినాడు. కాని ఎంతకీ సత్యానికి నిద్రపట్ట



లేదు. తన తండ్రి ఏమైనట్టు? రేపు తనసంగతి ఏమయ్యేట్టు? ఇదే అతని ఆలోచన.

అకస్మాత్తుగా సత్యానికి తండ్రి మీద గౌరవం కలిగింది. ఈ ప్రపంచం తనతండ్రిది; తనది కానే కాదు. ఈవిషయం తాను విచారించటం అనవసరం. తను తండ్రిని ఎన్నడూ సరిగా అర్థంచేసుకోక అన్యాయం చేశాడు. తండ్రి తనకి ఏమపకారం చేశాడు? చదువుకో మన్నాడు, భయభక్తులతో ఉండమన్నాడు. తన తండ్రి భయభక్తులతో చదువుకో బట్టేకదా తాను చెయ్యలేని వ్యవహారాలన్నీ చేస్తున్నాడు. భగవంతుడి దయవల్ల తను మళ్లీ చిన్న వాడైతే ఎన్నటికీ తన జీవితంగురించి విచారించననుకున్నాడు సత్యం.

ఇదే సమయంలో ఇంటి మెట్ల మీద సూరయ్య కూచుని ఉన్నాడు చీకట్లో. జరిగిన దేమిటంటే, సూరయ్య రెండున్నరగంటలబండి ఎక్కాడు. రెండుమూడు స్టేషనులు దాటగానే టిక్కెట్టుకలెక్టరొకడు వచ్చి అయన్ను టిక్కెట్టు అడిగాడు. నిజంగా పసివాడైతే అంత బిక్క మొహం పెట్టకపోను సూరయ్య. కాని అన్నీతెలిసినవాడుకనక టిక్కెట్టు కలెక్టరును చూడగానే





సూరయ్యా తప్పుచేసిన మొహం పెట్టాడు. సూరయ్యాజేబులో దమ్మిడీలేదు. సూరయ్యా చెంపలు రెండూ వాయించి రైలునుంచి దింపేశాడు టిక్కెట్టు కలెక్టరు.

చేసేదిలేక సూరయ్యా కాళ్లీడ్చుకుంటూ పదహారుమైళ్లదూరమూ నడిచి, తిండికి మాడుతూ దుమ్ముకొట్టుకుని రాత్రి పదకొండింటికి ఇల్లుచేరుకున్నాడు. తలుపుతట్టి పిలిస్తే అందరూ తలోప్రశ్నా అడుగుతారు. అందుచేత మెట్లమీద కూర్చుని ముందు జరగవలిసినదాన్ని గురించి ఆలోచించ సాగాడు.

ఇక తను కుర్రవాడుగా ఒక్క రోజు కూడా గడపలేదు. ఈ ప్రపంచం కుర్ర వాళ్లదికాదు. తను ఒకప్పుడు కుర్రవాడై ఉండికూడా వాళ్ల కష్టసుఖాలు మరిచాడు. తనకొడుకు మొండితనమే చూచాడుగాని వాడు ఎన్ని ఇబ్బందులు పడుతున్నాడో ఆలోచించలేదు. వాణ్ణి ఆపేక్షగా పలకరించి ఎంతకాలమయింది? కన్న తండ్రి ఎవడైనా ఇట్లా చేస్తాడా? భగవంతుడి దయవల్ల మళ్లీ తాను ఎప్పటిలాగ అయితే కొడుకును ఎంతో ఆపేక్షగా చూస్తా ననుకున్నాడు. వాడికి ఒక్కరవ్వయినా కష్టం కలగనివ్వ ననుకున్నాడు.

ఇదంతా చూస్తూన్న లక్ష్మీ అమ్మవారు సత్యనారాయణస్వామివారితో, "పాపం, వాళ్లిద్దరి కోరికలూ చెల్లించండి" అన్నది.

సరేనన్నారు స్వామివారు. మెట్లమీద కూర్చున్న సత్యం ముసలివా డయిపోయి నాడు. గదిలో మంచంమీద పడుకున్న సూరయ్యా కుర్రవా డైపోయినాడు.

"ఇక వాళ్లిద్దరూ సుఖంగా ఉంటారు," అన్నది అమ్మవారు.

"ఏం జరుగుతుందో ఇప్పుడే చూద్దువు గాని," అన్నారు స్వామివారు.

సూరయ్యా మెట్లమీద లేచి నిలబడ్డాడు. చాలా ఎత్తు లేచినట్టు ఆయనకు అనుమానం తట్టింది. కాని తన స్వరూపం మారినట్టు ఇంకా ఆయనకు తెలీదు. తలుపు గట్టిగాతట్టితే ఇంటిల్లిపాదీ లేస్తారు. అనేక ప్రశ్నలు వేస్తారు. ఒకరికైతే ఏదో ఒకటి చెప్పవచ్చు. అందుకని సూరయ్యా మెల్లిగా తలుపు తట్టాడు.

వంటలక్క వచ్చి తలుపుతీసింది. సూరయ్యానుచూసి ఆశ్చర్యపోతూ, "మీరు బయిటి కెప్పుడువెళ్లారు, బాబూ? గదిలో పడుకుంటిరే? తలు పెవరు వేశారు?" అని అడిగింది.

కాని సూరయ్యాకు వంటలక్క ప్రశ్నలేవీ వినిపించటం లేదు. ఇంతకాలానికి గాను వంటలక్క తనని ఎప్పటిమాదిరిగా బాబూఅని





పలకరించింది! మొహం తడువుకున్నాడు. మీసాలూ, కళ్లజోడూ తగిలాయి! నెత్తి బట్టతల! సంతోషం పట్టలేక సూరయ్యా కళ్లవెంట కన్నీరు ప్రవాహంగా కారింది. ఏదో అనబోయినాడుగాని మాట రాలేదు.

వంటలక్క గొంతువిని సత్యం మెట్లు దిగివచ్చాడు. తన తండ్రినిచూసి నిర్ఘాంత పోయినాడు. తనచేతులకేసి చూసు కున్నాడు.

సత్యాన్ని చూడగానే సూరయ్యాకు భగ్గున మండిపోయింది. ఈ వెధవేగదా తనకిన్ని కష్టాలు కలిగించాడు అను కున్నాడు. తనను బడికి పంపించాడు, పంతులుచేత కొట్టించాడు, గోడ కుర్చీ వేయించాడు, తన శరీరం దొంగిలించాడు, తన పడకగది కాజేసి, తన తాళపుచెవులూ, డబ్బూ, అన్నీ లాక్కున్నాడు.

"వెధవా! నీ ఆట ఇప్పటికి కట్టిందా?" అని సూరయ్యా రంకె పెట్టాడు.

సత్యానిక్కూడా తండ్రినిచూస్తే మండి పోయింది. తన తండ్రే తనకు ఆ ముసలి శరీరం అంటగట్టాడు. ఇంత తినటానికి లేదు. పరిగెత్తటానికిలేదు, చెట్లెక్కటానికి లేదు. ముసలితనంలో తన శరీరం లాక్కుని కుర్రాడల్లే తిరిగాడు. ఇప్పుడు తనమీద కోప్పడుతున్నాడు.

"నా ఆటేకాదు, నీ ఆటా కట్టింది," అన్నాడు సత్యం పట్టలేని ఆగ్రహంతో.

♦ ♦ ♦

"చూశావా? వాళ్ల లోపాలను వాళ్లే సవరించుకోవాలి. మనం ఏమీ చెయ్యలేం? మనం ఇచ్చిన రెండు వరాలూ మరిచి వీళ్లు మళ్లీ ఎప్పటిలాగే ఉన్నారు," అన్నారు స్వామివారు.

[అయిపోయింది]



# అత్తా కోడళ్ళ కథలు

వెనకటికి ఒకవూళ్లో ఒక విధవరాలు వుండేది. భర్త చనిపోయేసరికి ఆమెకి యిద్దరు సంతానం. పెద్దవాడుకొడుకు, చిన్నది కూతురు.

ఆమెకు పెత్తనమంటే చాలా సరదా! పైగా నోరూ మంచిదికాదు. ఆమె గయ్యాళి తనం ఆ చుట్టుప్రక్కలంతా పేరు మ్రోగి పోయింది.

ఇలాగుండగా కొడుకు పెరిగి పెద్దవాడయ్యాడు. త్వరగా కొడుక్కి పెళ్లిచేసి కోడల్ని రప్పించుకుని పెత్తనం సాగించాలని ఆమెకు తొందర కలిగింది. కాని, ఆగయ్యాళికి తమ పిల్లని కోడలిని చేయటానికి ఏ తలిదండ్రులు ఒప్పుకుంటారు? పాపం, ఆమె చాలా ప్రయత్నించింది కాని, ఒకరూ తమ పిల్లనిస్తామని ముందుకురాలా. చివరికి ఎలాగో ఆమె బంధువులలోనే ఒకరు తమ పిల్లనివ్వటానికి ఒప్పుకున్నారు.

పిల్లని చూడటానికి విధవరాలు బయలుదేరింది. పిల్లని చూచుకుని సంబంధం ఖాయంచేసుకుంది. తర్వాత పిల్ల తల్లితో, ఆమాటా ఈమాటా మాట్లాడుతూ, "ఏమండీ మన అమ్మాయికి తినటానికి ఏమంటే ఎక్కువ యిష్టమండీ?" అని అడిగింది విధవరాలు.

"మా అమ్మాయికి ఆవకాయంటేనూ, అప్పడాల పిండి అంటేనూ తగని యిష్టమండీ. ఇప్పటికీ నేనెప్పుడైనా అప్పడాలు వత్తుదామని పిండి దగ్గిరపెట్టుకు కూర్చుంటే అటొచ్చి కాస్తా యిటొచ్చి కాస్తా, మొత్తం మీద నేను అప్పడాలు వత్తటం పూర్తి అయేసరికి పది అప్పడాలకు సరిపోయే పిండి అయినా కాజేసి తింటుంది." అని





చెప్పింది అకాబోయే వియ్యపరాలు. కాబోయే కోడలు, ప్రక్కనే నుంచుని ఇది విన్నది. అత్తగారు తనకిష్టమైనవి చేసి పెడుతుందిగామాలు అని మురిసిపోయింది.

ఒక సుముహుర్తాన వివాహంజరిగింది. కొంతకాలానికి కోడలు కాపరానికొచ్చింది. అత్త ఎంత గయ్యాళిదో అంత పీనాసికూడా. కోడలు కాపరానికొచ్చిన తర్వాత తనూ కొడుకూ, కూతురు రోజూ అవకాయ వేసుకుని తినేవారు. కాని కోడలికి మాత్రం ఒకపూటకూడా అవకాయ వేసేదికాదు. అంతేకాదు, కోడలు కూర్చున్నా తప్పే, నుంచున్నా తప్పే, శుభ్రమైన బట్టకట్టుకున్నా తప్పే. ఒక పువ్వులు పెట్టుకోడానికి లేదు. ఒక పండగ చేసుకోటానికి లేదు, ఆఖరికి మొగుడితో అత్తవింటుండగా మాట్లాడటానికికూడా కోడలు హడలి చస్తుండేది. పాపం, ఆపిల్ల మొగుడుకూడా తల్లి చేతిలో కీలుబొమ్మలా ఆడేవాడు. అలాగే అష్టకష్టాలుపడుతూ ఎలాగో కాలం వెళ్లబుచ్చుతోంది కోడలు.

ఇలా నాలుగేళ్లు గడిచినై. విధవరాలి కూతురికికూడా పెళ్లియీడు వచ్చింది. ఆ పిల్ల అదృష్టాన త్వరలోనే ఒక సంబంధం కుదిరింది. పెళ్లికి ముహూర్తంకూడా పెట్టుకున్నారు.

పెళ్లి యింకా నాలుగురోజు లుండగా అత్త కోడలుచేత అడ్డమైన చాకిరి చేయించి పెళ్లికి కావలసిన పచ్చళ్లు పెట్టించింది. కాని, అవకాయ, అప్పడాలు మాత్రం తనే పెట్టాలని నిశ్చయించుకుంది అత్త. కోడలికి ఆ రెండూ అంటే యిష్టంగదా? అందుచేత కోడలు ఆ రెండూ రుచిచూడకుండా చెయ్యాలని ఆగయ్యాళి పట్టుదల. ఆ రోజు అవపిండి, చేతులు మంటలు పుట్టటానికైనా





ఓర్చుకొని, అత్త తనే ఆవకాయ పూర పెట్టింది. అప్పడాలు తయారు చెయ్యటం మర్నాడు తనకే అట్టే పెట్టుకుంది. ఈ సంగతంతా కోడలు చూస్తూనేవుంది.

ఆ రాత్రి కోడలు మొగుడితో యిలా మాట్లాడుతోంది: "ఏమండీ, మీ అమ్మగారు మరీ యింత చుప్పనాతి దేమండీ. పచ్చళ్లు పెట్టటానికి నా చేత అడ్డమైన చాకిరీ చేయించుకుంది. తీరా ఆవకాయ పెట్టాల్సి వచ్చేసరికి, ఆ పని నాకు వప్పచెబుతే నే నెక్కడ రుచిచూచిపోతానో అని ఆమే స్వయంగా ఈవేళ ఆవకాయపెట్టింది. రేపు అప్పడాలు వత్తబోతున్నారు. నాకు అప్ప డాల పిండిఅంటే తగని యిష్టం. ఆవకాయ పెళ్లిలో నలుగురితోపాటు నాకూ వడ్డిస్తా రేమోనని ఆశపడుతున్నాను. కాని రేపు అప్పడాలు ఒత్తేసింతర్వాత ఒక్క పిసరైనా నాకు మిగలదే! ఎలాగండీ" అని.

"ఏమో నాకు తెలీదు. నీ యిష్టంవచ్చి నట్లు అఘోరించు" అని విసుక్కున్నాడు భర్త.

"అయితే నాకు ఒక ఉపాయంతోచింది. అలా చేస్తాను. రేపు అప్పడాలపిండి రోట్లో మీఅమ్మగారు తొక్కినతర్వాత రోలు కడగ



వలసినపని నాదేగదా. మన రోలుకూడా మొన్ననేకక్కు కొట్టించింది గదా. అక్క డక్కడా కొంచెమైనా పిండి యిరుక్కుని వుండకపోదు. ఆ పిండి గీక్కుని తింటాను. ఇంతకుతప్ప నాకు పిండి దక్కేమార్గం కనిపించటంలేదు" అని చెప్పింది కోడలు.

ఈ సంభాషణంతా ఆ ప్రక్క వసారాలో పడుకున్న అత్త విన్నది. "ఆరె దీని తస్సా గొయ్యా! ఇదా దీని ఆలోచన? నేనేనా అంత తెలివితక్కువదాన్ని!" అనుకుంటూ అత్త ఒక్కసారిగా లేచి వంటింట్లోకి వెళ్లింది. ఆ రాత్రికి రాత్రే అప్పడాలపిండి రోట్లో



తొక్కింది. తర్వాత "రోలు కడిగిపారేస్తాను. ఇంక అది గీరుకుతినేదేమిటి!" అని రోలు కడగబోయింది. కాని ఆమె పీనాసిదిగదా! అంచేత రోట్లో యిరుక్కున్నపిండి తనే గీరుకుంటే మరో అప్పుడానికైనా రాక పోతుందా అనిపించింది. అలా గీకు తుండగా పిండి రాకపోగా ఆ రోటిగతుకుల్లో గోమ పట్టుకుని చిగురు అంటి భగభగ మంట పుట్టటం మొదలుపెట్టింది. "ఇదిగాదు పద్ధతి, రోట్లో పిండి కాస్తా నేనే నాకు తాను. దాంతో నా కడుపునిండినట్టూ అవు తుంది దానికడుపు ఎండినట్టూ అవుతుంది" అని ఆలోచన తట్టింది అత్తకి. అంతచక్కటి ఆలోచన తట్టిందన్న సంతోషంలో అత్తతల ఒక్కసారి రోట్లో దూర్చింది. అసలే బోడి తలేమో, ఒక్కసారిగా యిరుక్కుపోయింది. పాపం, ఏంజేస్తుంది? పోనీ అరుద్దామంటే, దవడలు కదపటానికికూడా వీలులేకుండా యిరుక్కుపోయింది. పాపం, మూలుగుతూ అలాగే వుండిపోయింది. కాని, ఎవరు విన్నారు ఆమె మూలుగు? కొడకూ కోడలూ గాఢ నిద్రపోతున్నారు.

తెల్లవారుతున్నదనగా పాచిపని చేసే ఏనాది సుబ్బాం, "అమ్మగోరూ, అంట్లెయ్యండీ" అంటూ అత్త యిరుక్కున్న రోటిదగ్గిరికి వచ్చింది. అదిచూచి, కొడుకునీ, కోడల్ని ఏనాదిది కేకపెట్టి లేపింది. వాళ్లు వచ్చి చూచి తెల్లపోయారు. యిద్దరూ చేరి చాలా ప్రయత్నించారు. కాని లాభం లేక పోయింది. అప్పుడు ఏనాదిది "అయ్యగోరూ, మీరు ఒక్కపాలిగా ఎగిరి అమ్మగోరి నడ్డిమీద సతికిలపడండి. తల దానంతటవే వచ్చేసుద్ది" అని సలహాయిచ్చింది. సరే కొడుకు అలాగే చేశాడు. ఒక్కసారిగా అత్తయివతల పడింది. మొహంవాపూ, నడ్డి తీపూతో, పెళ్లి అయిపోయేదాకా ఆమె లేవలేదు; ముసుగు పెట్టుకు పడుకుంది.



# బుజ్జమ్మ కథలు

అప్పుడే వాళ్ల బావ బండి దిగి రావటం చూసింది బుజ్జి. గబగబా లోపలికి పరుగెత్తి "అక్కా, బావ వచ్చాడే!" అని కేక వేసింది. వాళ్ల అక్క కాళ్లు కడుక్కునేందుకు నీళ్లు తీసుకువచ్చి బావకి ఇచ్చి ఒక రోజు ఆలస్యంగా వచ్చినందుకు కాబోలు, చురచుర చూసింది.

వాళ్ల బావఅక్కకోపం గ్రహించాడు. మెడ్రాసునుంచి తను తెమ్మన్న సిల్కు చీరను తేలేదని అప్పుడే ఎలా తెలిసింది చెప్మా, అనుకుంటూ "క్షమించునాగూ! ఈమారు సెలవలికి వచ్చినప్పుడు తప్పకుండా చీరె తెస్తాను," అన్నాడు.

"నేను మొన్న వుత్తరంరాసినా తేలేదు కాని, ఈమారు మహ తెచ్చారులెండి!" అని అక్కమూతి ముడుచుకుని లోపలికి వెళ్లిపోయింది. వాళ్ల బావకికూడా వళ్లు మండింది. ఆమె పలకరించేవరకూ తను మాట్లాడకూడదనుకున్నాడు. బుజ్జికి అర్థమయింది వాళ్ల కోపాలసంగతి.

ఇంతలో వాళ్లనాన్నగారువచ్చి "ఓహో నువ్వా మధూ? మెడ్రాసునుంచేనా?" అంటూ కాళ్లు కడుక్కునేందుకు స్నానాల గదిలోకి వెళ్లారు.

వాళ్ల అమ్మవచ్చి "వంట అయింది లేవండీ? కాళ్లు కడుక్కోవోయి మధూ నించున్నావేం?" అంది.

వాళ్ల అన్నయ్య వచ్చి "బావగారూ, ఎప్పుడు వచ్చారండోయ్" అని లోపలికి వెళ్లి "నాగూ! బావవచ్చినా, కోపమా ఏం?" అన్నాడు.

అంతా భోజనానికి కూర్చున్నారు. బుజ్జికి ఈ సంగతులు ఏవీ మనస్సుకు ఎక్కలేదు. అక్కా బావల కలహం ఎలా తీర్చాలా అని ఆలోచిస్తూంది.

తనకి కోపంవస్తేమాత్రం కాస్త బతిమాలకూడదా? తను ఏమయినాసరే ముందు మాట్లాడకూడదు అనుకుంది వాళ్ల అక్క. అంతకన్నా వాళ్ల బావ పంతంపట్టి కూర్చున్నాడు. వీళ్లని ఎలాగైనా

అడివి రాధావసంత, భీమవరం.



మాట్లాడించాలనుకుంది బుజ్జి. అందరి భోజనాలూ పూర్తి అయినాయి. బుజ్జికి మెరుపులా ఒక ఆలోచన తట్టింది.

ఆ సాయంత్రం వాళ్ల అక్కా, బావా వేరు వేరు గదులలో స్నానాలుచేసి వాళ్ల గదిలోకి వెళ్లారు.

బుజ్జి చావిట్లో కుర్చీలో కూర్చుని చంద మామను చూస్తోంది. పంచె తీసుకుందా మని వాళ్లబావ పెట్టెతీశాడు. అందులో చీరెలు, జాకెట్లు ఉన్నాయి! వెంటనే ఒక చీర తీసుకుని ఇలా ఎందుకు జరిగిందో కనుక్కోవాలని భార్యవైపు చూశాడు.

వాళ్ల అక్క చీరకోసమని తన పెట్టె తీసింది. అందులో షర్టులు, పంచెలు ఉన్నాయి! వెంటనే ఒకపంచె తీసుకుని ఇలా ఎందుకు జరిగిందో కనుక్కోవాలని



భర్తవైపు తిరిగింది. కోపంఅమె విశాలమైన కళ్లల్లో తాండవంచేస్తూ ఉంది.

ఇద్దరూ ఒక్కమారే "ఏమిటిదీ?" అంటే "ఏమిటిది?" అనుకుని ఒకరి నొకరు అతికోపంగా చూసుకున్నారు.

"ఈ బట్టలు ఎవరు మార్చారు?" అంటే "ఎవరు మార్చారు?" అనుకున్నారు.

అప్పుడు బుజ్జి కుర్చీలోంచి లేచి,

**"అక్కా, బావా**
**అల్లరి పిల్లలు,**
**పూరకె యుద్ధం**
**చేశారోయ్"**

అని పాడుతూ చప్పట్లు వేయడం మొదలు పెట్టింది. అపాట వినేసరికి వాళ్ల ఇద్దరి కోపం మంచులా మాయమైంది. ఇద్దరూ బుజ్జిని ఎత్తుకున్నారు.

అప్పుడు బుజ్జి, "నేనుచేసిన గమ్మత్తు మీకు తెలిసిందా?" అన్నది.

"ఇప్పుడు ఇద్దరిలో ఎవరూ ఓడిపోలేదు. మీ ఇద్దరూ ఒక్కసారే మాట్లాడారు కూడాను. ఇంక హాయిగా మాట్లాడుకోండి. ఎప్పుడూ కలహించకండేం?" అని కలువ పువ్వులా నవ్వుతూ తీర్పుచెప్పింది.

ఇప్పుడు అర్థమైంది అక్కా బావలకి, వాళ్ల బట్టలు అలా ఎందుకు మారాయో! ఒక్కమాటు ఇద్దరూ నవ్వుకున్నారు.







# మంగయ్య తెలివి

ఒక ఊళ్లో ఒక సాలెవాడు వున్నాడు. అతని పేరు మంగయ్యా. ఆ వూళ్లో మంగయ్యాకు ఒక స్నేహితుడు వున్నాడు. అతనిపేరు రంగయ్యా. మంగయ్యా ఎంత తెలివి తక్కువవాడో రంగయ్యా అంత తెలివి గలవాడు.

మంగయ్యాకు దమ్మిడీ సంపాదించటం చేతకాదుగాని ఖర్చుమాత్రం మహా జోరుగా చేసేవాడు. ఒకనాడు మంగయ్యా భార్య అతనికి పది రూపాయలిచ్చి ఏదైనా చిన్న వ్యాపారం చెయ్యమన్నది. ఆ పది రూపాయలూ తీసుకుని మంగయ్యా, రంగయ్యా ఏమి సలహా ఇస్తాడో కనుక్కుందామని అతనిదగ్గరకు వచ్చాడు.

వచ్చి, "రంగయ్యా, రంగయ్యా - నా భార్య నాకు పదిరూపాయలిచ్చింది వ్యాపారం చెయ్యమని. ఏం వ్యాపారం చెయ్యమంటావ్?" అని అడిగాడు.

"నే నొక మంచి వ్యాపారం చెప్పాతాను. అట్లా గనక చేశావా మంచి లాభం వస్తుంది" అన్నాడు రంగయ్యా.

"ఆ వ్యాపారం ఏమిటో నాకు చెప్పు" అని తొందరబెట్టాడు మంగయ్యా.

"వ్యాపారం అంటే మరేంలేదు. మా గుఱ్ఱం నిన్న గుడ్డుపెట్టింది. దాన్ని ఇరవై రూపాయలకు వీరయ్యా అడిగాడు. నీకు కాబట్టి పది రూపాయలకు ఇస్తాను. ఆ గుడ్డును నువు పక్కలో పెట్టుకు పడుకుంటే పది రోజుల్లో మాంచి గుఱ్ఱపు పిల్ల అవుతుంది. అప్పుడు నువ్వు దాన్ని ఏ యాభైరూపాయలకో అమ్ముకోవచ్చు. నలభైరూపాయలు సులభంగా లాభం దొరుకుతుంది" అన్నాడు రంగయ్యా.

గుఱ్ఱం ఎక్కడైనా గుడ్డుపెడుతుందా? పిచ్చి మంగయ్యాకు యీ మాత్రం లోక జ్ఞానంగూడా లేదు. నిజంగా లాభం వస్తుందిగదా అనుకుని పదిరూపాయలూ రంగయ్యాచేతిలో పెట్టి గుఱ్ఱపు గుడ్డు ఇవ్వమన్నాడు.

రంగయ్యా ఇంట్లోకి వెళ్లి ఒక బూడిద గుమ్మడికాయకు బాగా సున్నం పూసి

మూ ల్పూరి ఆ హెూ బలరావు, బాపట్ల

తీసుకువచ్చి మంగయ్యకిచ్చి "ఇదేగుర్రపు గుడ్డు. తీసుకొని వెళ్లు" అన్నాడు.

మంగయ్య దాన్ని నెత్తిన పెట్టుకొని బయలుదేరాడు. ఆ దారిలోనే ఒక పెద్ద అడవి వున్నది. అడవి మధ్యనుంచి నడచి వెళ్తూవుండగా పెద్ద మఱ్ఱిచెట్టువేరు కాలికితగిలి మంగయ్యదభేలున ముందరికి పడ్డాడు. దాంతో మంగయ్య నెత్తిన వున్న గుమ్మడికాయ క్రిందపడి పగిలింది.

గుమ్మడికాయ క్రిందపడి పగిలిన శబ్దానికి అక్కడే పొదలోవున్న కుందేలు భయపడి పరుగెత్తటం మొదలుపెట్టింది. ఆ కుందేలునుచూచి మంగయ్య "అరే! గుడ్డుపగిలి గుర్రంపిల్ల పరుగెత్తుకు పోతోందే" అనుకుని పట్టుకుందామని కుందేలువెంట పరిగెత్తాడు. కాని కుందేలు అందకుండా పారిపోయింది.

ఇంటికివచ్చి యీ సంగతంతా భార్యతో చెప్పాడు. భార్య, "ఎక్కడైనా గుర్రం గుడ్డుపెడుతుందా!" అని మంగయ్యను తల వాచేటట్టు చీవాట్లుపెట్టింది.

మరునాడు మంగయ్య భార్య "పది రూపాయలూ తగలేశావు. ఇంట్లో దమ్మిడీ కూడా లేదు. ఎక్కడికైనా దొంగతనానికి పో" అన్నది మంగయ్యతో.

సరేనని తలవూపి సరాసరి రంగయ్య యింటికి వెళ్లి "రంగయ్యా, రంగయ్యా, నా భార్య దొంగతనానికి పొమ్మంది. ఎక్కడకు పోదాం?" అని అడిగాడు మంగయ్య.





"ఇళ్లల్లో దొంగతనంచేస్తే తేలిగ్గా పట్టుబడిపోతాం. అందుకని పొలాల్లోకి పోదాం" అన్నాడు రంగయ్య.

ఇద్దరూ ఆ రాత్రి ఒక వరిపొలంలో ప్రవేశించారు. పంట బాగా కోతకువచ్చింది. "కోద్దాము పట్టు" అన్నాడు రంగయ్య. చేతులు బాగా నొప్పిపుట్టేవరకు కోశారు. రంగయ్య మంగయ్యతో "నీకు పైనవుండే కంకులుకావాలా, లేకపోతే కిందవుండే వరిగడ్డి కావాలా?" అని అడిగాడు.

మంగయ్య కాస్సేపు ఆలోచించి "నాకు కిందవుండే గడ్డేకావాలి" అన్నాడు.

రంగయ్య గడ్డి అంతా మంగయ్యకిచ్చి తను వరికంకులు పట్టుకుపోయాడు.

ఇంటికి పోగానే భార్య "ఎందుకీ గడ్డి? వరికంకులేవి?" అని అడిగింది.

మంగయ్య జరిగిన సంగతంతా చెప్పాడు. ఆమెకు కోపంవచ్చి "ఓరి నీ తెలివిమండా! ఇకముందు ఎప్పటికైనా పైవే అడుగు" అన్నది.

"సరే"నని తల వూపాడు మంగయ్య.

మర్నాడు మంగయ్య రంగయ్య వద్దకు వచ్చి "ఇవ్వాళ నాకు పైపంట కావాలి" అన్నాడు. రంగయ్య ఒప్పుకున్నాడు. ఇద్దరూ కలిసి ఆ రాత్రి వేరుశనగ పొలంలో



పడ్డారు. ఉన్న చెట్లన్నిటినీ పెరకివేశారు. రంగయ్య మొక్కలన్నీ మంగయ్యకిచ్చి తాను కాయలు పట్టుకుపోయాడు. మంగయ్య ఎందుకూ పనికిరాని వేరుశనగ మొక్కలు తీసుకుని ఇంటికివచ్చాడు.

అతని భార్య వాటినిచూచి "ఇవెందుకూ, నెత్తిన వేసుకుని కొట్టుకునేందుకా? కాయ లేవీ?" అన్నది.

మంగయ్యకు వళ్లు మండేటట్లు కోపం వచ్చి "మొదట కిందివితెస్తే పైవి తెమ్మంటివి. ఇప్పుడు పైవితెస్తే కిందివి కావాలంటావ్! ఎట్లా నీతో వేగటం?" అన్నాడు.

పెళ్లాం చేసేదిలేక అలాంటి తెలివి తక్కువ దద్దమ్మని పెళ్లిచేసుకున్నందుకు తననితాను నాలుగు తిట్టుకొని ఊరుకుంది.

# ఒంటె, నక్క, తోడేలు

యజమాని గంతలు మోసి మోసి విసుగెత్తి ఒక ఒంటె అడవిలోకి పారిపోయింది. అపేడు వేసంగి ఎండలకు చిన్నచిన్నచెట్లు, పొదలు, సన్నజీవాలు చచ్చిపోయాయి. ఒంటెకు ఎక్కడా మేతదొరకలేదు. మేతకోసమని అది తిరుగుతూ ఉండగా ఒక నక్క ఎదురుపడి "ఒంటెబావా, ఒంటె బావా! నీవు చల్లగా ఉన్నావా?" అని అడిగింది.

"ఏమి చెప్పను నాయనా? ఎక్కడా పచ్చని పచ్చికైనా కనిపించటంలేదు. మేతకోసం ఆరురోజులనుంచి అలమటించి పోతున్నాను" అన్నది ఒంటె.

"నాగతీ అలాగేవుంది. పదిరోజుల నుంచి మేకకాకపోతేమానె, మేకపిల్ల అయినా దొరకలేదు. నీకు మేత కావాలి. నాకు మాంసం కావాలి. మనం ఇద్దరం కలిసి పోదామా?" అన్నది నక్క. ఒంటె సరేనన్నది.

ఈవిధంగా రెండూ కూడబలుకుకొని పోతూవుండగా దారిలో ఒక గుంటనక్క ఒక తోడేలు కలిశాయి. ఆ నాలుగుకలిసి వుండసాగినై. వాటికి ఎక్కడా తిండిదొరకలేదు. కడుపులు మండిపోతున్నాయి.

ఇలా పదిరోజులు పస్తులతో గడిచినాయి. చివరికి తోడేలు నక్కను చాటుగా పిలిచి, "ఇక లాభం లేదు. నేను, నువ్వు గుంటనక్క కలిసి ఒంటెను చంపి దాని మాంసం తిందాము" అన్నది.

"నీకు అంతా తొందరే. ఒంటె తనని తినమని మెడచాపుతుం దనుకొన్నావు కామాలు. దానికి కోపం వస్తే మనం ముగ్గురం ఎక్కడుంటాము? ఇది బలంతో అయ్యేపనికాదు. నేను ఒక ఉపాయం చెబుతాను. నీవు కాళ్ళు నిగడదన్ని పొట్ట ఉబ్బించి చచ్చినట్లు పడుకో. నేను ఏమి చేసినా నీవు వూరుకోవాలి. లేకపోతే కడుపు మాడి మనమందరం చస్తాము. నేను కేక వేయగానే పరిగెత్తుకురా" అన్నది నక్క. సరేనని తోడేలు అలాగే పండుకొన్నది.

నక్క ఒంటెదగ్గరకు వెళ్ళి, "ఎలా ఉన్నావు?" అని పలకరించింది. అది కళ్ళనీళ్ళుపెట్టుకొని "ఏమిచెప్పను? ఈ వేసవికాలం ఎలా వెళ్లమారుతుందా అని కనిపెట్టుకుని వున్నాను" అన్నది.

"మాకు అంత చిక్కులేదు. అటు చూడు. తిండి మానుకోవటంకోసమని తోడేలు వేసవికాలమంతా చచ్చిపడి వుంటుంది. చినుకులుపడగానే నేను దానిని తీసికెళ్ళి నీళ్ళలోవేసి, 'రావే తోడేలా' అంటే మళ్ళీ బ్రతికివస్తుంది" అన్నది నక్క.

"నిజమేనా? మళ్ళీ బ్రతుకుతుందా?" అని ఒంటె ఆశ్చర్యంగా అడిగింది.

"నీవేచూడు' అంటూ నక్క తోడేలును లాక్కువెళ్లి నీళ్ళలో పడవేసి "రావే తోడేలా" అంది. ఆ పిలుపు వినగానే తోడేలు లేచి ఒళ్ళువిరుచుకొని వచ్చింది.

ఒంటె నమ్మింది. "అయితే నన్ను ఈ వేసవికి ఒక్కసారిమాత్రం చంపండి" అని ఒంటె పడుకున్నది. ఒంటె ఈ మాట అని పడుకోగానే తతిమ్మా మూడూ



దానిమీదపడి చీల్చి మాంసం పోగులు పెట్టాయి. "ఈ పేగులు నదిలో జాడించుకువస్తా" నని తోడేలు నదికివెళ్ళింది.

"చూస్తా వెందుకు, మంచి మంచి ముక్కలు తిందాము రా" అని నక్క గుంటనక్కను పిలిచింది.

"తోడేలు ముక్కలను లెక్కపెట్టుకుపోయింది. వచ్చింతరువాత లెక్కకుతగ్గితే మన డొక్కలు చీలుస్తుంది కామాలే" అన్నది గుంటనక్క.

"సరే అది వచ్చిందాకా కూర్చో" అని నక్క ఒంటె మెదడు గుండెకాయ తినటం

నావంక చూచి తిన్నావు గనకనా ?" అన్నది నక్క.

తోడేలు అమాంతం గుంటనక్క వేపు దూకింది. గుంటనక్క కాళ్ళకు బుద్ధి చెప్పింది. దాన్ని వదలక తోడేలు వెంట బడ్డది. ఇలా, ముందు గుంటనక్క వెనక తోడేలు పరిగెత్తుతూవుంటే నక్క ఒంటె మాంసం తిన్నంత తిని మిగిలింది తన బొరియలోకి చేరవేసింది. తోడేలు తిరిగి వచ్చేటప్పటికి ఒక ఎముక ముక్కగూడా మిగలలేదు. నక్కను కలా మెలా చూచి, "ఏదీ మాంసం" అని అడిగింది తోడేలు.

"ఏమి మాంసం ?" అన్నది నక్క.

'ఒంటెమాంసం" అన్నది తోడేలు.

"ఒంటెమాంసం మన కెక్కడిదీ ?" అన్నది నక్క.

"నీకు బొత్తిగా మతిపోతూ వుంది. ఇక్కడ ఒంటె, మనముగ్గరం ఉన్నామా. అప్పుడు ఒంటెను చంపటం, గుంటనక్క పారిపోవటం జరగలేదా" అంది తోడేలు.

"అవును గుంటనక్క పారిపోయింది."

"నేను గుంటనక్కవెంట వెళ్ళితినిగా. ఆ మాంసం ఉండాలి. ఏమైంది ఆ మాంసం ?" అని అడిగింది తోడేలు.

"ఏమిమాంసం ? గుంటనక్క పారి పోయిందా లేదా అంటే పారిపోయిందని

మొదలెట్టింది. గుంటనక్కకూడా భాగం పంచుకొన్నది.

తోడేలు నదిదగ్గరనుంచివచ్చి మాంసం పోగు చూచి తల ఆడిస్తూ, "మెదడు కని పించదేం?" అని గుంటనక్కను గద్దిం చింది. గుంటనక్క నక్కవంక చూచింది.

"ఒంటెకు మెదడెక్కడిదీ? ఉంటే చంపించుకుంటుందా ?" అన్నది నక్క.

"సరే. గుండెకాయ ఏదీ ?" అని తోడేలు మళ్లీగుంటనక్కవంక కొరకొర చూచింది.

గుంటనక్క మళ్లీ నక్కవేపుచూచింది. "నావంక చూస్తావెందుకు? తిన్నప్పుడు



చెప్పాను. మళ్ళీమాంసమంటా వేమిటి ?" అంది నక్క.

నక్కకు అన్నిసంగతులూ జ్ఞాపకము వున్నాయి కాని మాంసం సంగతిమాత్రం మరచిపోయింది. తోడేలు అడిగి అడిగి విసిగి "నీవు నాకు టోపీ పెట్టాలని చూస్తు న్నావు; నాకు తెలుసు. అపప్పులు ఇక్కడ ఉడకవు. మాంసం ఎక్కడుందో చెప్పు" అని డబాయించింది,

నక్క ఇది గ్రహించి తన బొరియలో దూరి తలుపు గట్టిగా బిగించుకొన్నది. తోడేలుబొరియవాకిలికి ఎదురుగా కూర్చుని, "నిన్ను వదలుతా ననుకొంటున్నా వేమో? అది కల్ల. ఎటుతిరిగి నీవు బయటికి రాత తప్పదు నేను నీపేగులు చీల్చక మానను" అని ప్రతిజ్ఞ చేసింది.

అంతలో ఒక గుర్రం దగ్గర్లో కనిపిం చింది. బొరియ కంతగుండా నక్క దాన్ని చూచి "లేని ఒంటెమాంసంకోసం కలలు కంటే లాభ మేముంది? అడిగోదగ్గర్లో గుర్రం కనిపిస్తూవుంది. ఇద్దరంపోయి దాన్నిచంపి తిందాముపద. నువ్వు అక్కడ నేను ఇక్కడ ఆకలితో మాడి చావటం దేనికి?" అన్నది.



తోడేలుకు కడుపులో చురచురా కాలు తున్నది. దానితో మాంసం సంగతి మరచి వెళ్ళుదాం రమ్మన్నది. ఆ రెండూ కలిసి గుర్రందగ్గరకు వెళ్ళాయి. "అమాంతం దానిమీదపడి చంపుదాం" అంది తోడేలు.

"నీకు ఎప్పుడూ తొందరే. గుర్రంఊరికే వచ్చి నోట్లో పడుతుందనుకొన్నావా ? మన సంగతి పసికడితే అది మళ్లీ ఎవరికికూడా దొరకదు. కాస్త తమాయించు" అని తోడే లుకు కన్నుగీటి నక్క గుర్రం దగ్గిరికి పోయి ఇలా అంది.



"మిత్రమా! ఆకలితో ముగ్గురం చస్తున్నాము. ముగ్గురం చావటం దేనికి. ఒకళ్లు చస్తే ఆ మాంసంతో మిగతా యిద్దరూ బ్రతకవచ్చును గదా?" అని.

"నీవుచెప్పిన వుపాయం బాగానేవుంది. అయితే ఎవరు చావాలి!" అంది గుఱ్ఱం.

"పెద్దవాళ్ళకోసం చిన్నవాళ్ళు త్యాగం చేయడం ధర్మం" అన్నది నక్క.

గుఱ్ఱము, తోడేలు దానికి ఒప్పుకొన్నాయి. నక్క తరువాత యిలా అంది. "మీ అందరిలోకి నేనేపెద్ద ననుకొంటాను. ఎందుకంటే దేవతలు రాక్షసులు అమృతం కోసం పోట్లాడుకున్నప్పటికే నాకు చూపు మధ్యమైంది..."అని యింకేమో చెప్పబోయింది.

తోడేలు వెంటనే అందుకొని, "నిజమే, అయుద్ధంలో నా మనుమళ్ళు కూడా చచ్చిపోయారు. నా ముని మనుమళ్ళను సాకలేక నాతాడుతెగింది," అన్నది.

వెంటనే గుఱ్ఱం అన్నది: "మీరు చాల పొరపడుతున్నారు. మీకంటె నేను చాల పెద్దవాణ్ణి. నేను ఎప్పుడు పుట్టానో నాకు తెలియదు. కాని నా వెనక కాలిగిట్టమీద నా యజమాని వ్రాశాడు. కావలిస్తే మీరే చూడండి" అని.

"ముసలివాణ్ణి కావటంవల్ల నాకు కళ్ళు సరిగా కనుపించవు. కాస్త వెనకకు పోయి చూడు" అని నక్క తోడేలును పంపింది.

తోడేలుకు బుద్ధిలేదు. నక్కమాటనమ్మి గుఱ్ఱం వెనుకకు పోయింది.

తోడేలును సరిగా కాళ్లదగ్గరకు రానిచ్చి గుఱ్ఱం పెడేలున ఒక్కతన్ను తన్నింది. ఆతాపు డొక్కలోతగిలి తోడేలు గింగిరాలు తిరిగి చచ్చింది. ఇక గుఱ్ఱం అదే పరుగు.

"అమ్మయ్యా, ఎన్నాళ్ళకు శని విరగడైంది రా" అని సంతోషంతో నక్క ఒక్కసారికూసి తన బొరియలోకిపోయి పడింది.






ఒకసారి కృష్ణదేవరాయలవారు యింకో పరరాజుతో యుద్ధం చెయ్యవలసి వచ్చింది. రాయలవారి సైన్యంలో అప్పుడున్న గుఱ్ఱపు దళం చాల చిన్నది. అందువల్ల యుద్ధం యింకో నాలుగు నెలలుండనగా రాయలవారు తమ గుఱ్ఱపుదళాన్ని ఎక్కువ చెయ్యాలని నిశ్చయించుకున్నారు. దాదాపు ఒక వెయ్యి గుఱ్ఱాలవరకూ కొన్నారు. యుద్ధం మొదలుపెట్టె రోజులోపల అన్నింటికీ మంచి పోషణచేసి అన్నిటినీ బలంగా తయారు చెయ్యాలనుకున్నారు. "ఈ గుఱ్ఱాలని తమ యితరసైన్యంతో చేర్చితే వాటికి పోషణ సరిగ్గా జరుగును జరక్కపోను. తమ రాజ్యంలో వున్నవారికే తలకొక గుఱ్ఱం చొప్పున యిచ్చి, తలకొక పది పదిహేను రూపాయలు యిచ్చి జాగ్రత్తగా మేపమంటే, వాళ్లకి తృణమో పణమో ముట్టజెప్పినట్టూ అవుతుంది, తమ గుఱ్ఱాలని జాగ్రత్తగా మేపుతారు" అనుకున్నారు రాయలవారు.

సరే, యిలా ఆలోచించుకుని మర్నాడు ఈసంగతి రాజ్యంలో చాటించారు. చాల మంది వచ్చారు; అప్పుడు రాయలవారు తలకొక గుఱ్ఱాన్నియిచ్చి యిలా చెప్పారు:-

"మీరు ఈ గుఱ్ఱాల్ని తీసుకువెళ్ళి జాగ్రత్తగా మేపాలి. అందుకయ్యే ఖర్చులకుగాను మీకు నెలకు పదిహేనురూపాయల చొప్పున యిస్తాను. మనం జరపబొయ్యే యుద్ధానికి ఇంకా నాలుగునెలలగడువుంది. ఈలోగా గుఱ్ఱాలన్నీ బలంగా తయారు కావాలి. నెలకొకసారి మీ మీ గుఱ్ఱాలనితెచ్చి మాకుచూపించి వెళ్లాలి".

వచ్చినవారంతా సరేనంటే సరేనని తలకొక గుఱ్ఱాన్నీ పదిహేనురూపాయలూ తీసుకుని వెళ్లారు. అందరితోపాటు రామలింగం కూడా ఒక గుఱ్ఱాన్ని తీసుకెళ్లాడు.

గుఱ్ఱాలని తీసుకుని వెళ్లినవాళ్లంతా, "అన్నిటికంటె నాగుఱ్ఱమే బలంగా వుండేట్టు చేసి రాయలవారి మెప్పుపొందా"లని ఎవరికి వారు తమ తమ గుఱ్ఱాలకు మంచిదాణా అదీపెట్టి పెంచుతున్నారు. కాని రామలింగం మాత్రం తనుతెచ్చిన గుఱ్ఱాన్ని ఒక చీకటిగదిలోపెట్టి వుంచాడు. గదికి మూడు వైపుల సూదిమొనంత బెజ్జమైనాలేకుండా





చేశారు. చివరికి రామలింగం వచ్చాడు, చేతులుజాడించుకుంటూ.

"నీ గుఱ్ఱమేదోయ్, రామలింగం?" అని అడిగారు రాయలవారు.

"అయ్యా! నా గుఱ్ఱం యిప్పుడు నా మాట వినేట్టుందా! అందరి గుఱ్ఱాలకంటె నా గుఱ్ఱమే బాగుండాలని మీరు యిచ్చిన పదిహేను రూపాయలుగాక యింకో అయిదు రూపాయలు నా చేతివివేసి దానికి మంచి మంచి దాణాపెట్టి ఎంతో జాగ్రత్తగా చూశాను. నేనలా చూడటమే పెద్ద పొరపాటైపోయింది. దానికి యిప్పుడు బాగా క్రొవ్వెక్కివుంది. నన్ను దగ్గిరికే రానివ్వటం లేదు. దాన్ని యిక్కడికితేవటం నాతరం కాదు. అవసరమనితోస్తే మన గుఱ్ఱపు ధళానికి నాయకుడైన అబ్దుల్లాఖాన్ని పంపి తెప్పించండి. అతనికి ఎలాంటి పొగరుబోతు గుఱ్ఱమైనా లొంగుతుంది" అన్నాడు రామలింగం.

సరేనని అబ్దుల్లాఖాన్ని రామలింగం వెంట పంపారు రాయలవారు. ఈ వింత చూద్దామని మిగతా వారుకూడా వెంట వెళ్లారు. రామలింగం ఖానును తన గుఱ్ఱం వున్న చీకటి కొట్టుదగ్గిరికి తీసుకువెళ్లాడు. "బైట కట్టేస్తే తెంచుకుని పారిపోతోంది. అందుకని దాన్ని ఈ గదిలో కట్టిపడేశాను, చూడు" అని రామలింగం ఖానుని కంత దగ్గిరికి పంపాడు.

చేశాడు. నాలుగోవైపుమాత్రం ఒక చిన్న కంత పెట్టాడు. ఆ కంతగుండా రోజూ గుప్పెడంటె గుప్పెడుగడ్డిమాత్రం అందించే వాడు. ఇంతకుమించి పాపం దానికి వేరే తిండిపెట్టేవాడుకాదు. ఆ గుప్పెడు గడ్డేతిని గుఱ్ఱం చావకుండా బతకకుండా అలాగే రోజురోజుకూ చిక్కిపోతూవుంది. రామలింగం మాత్రం రాయలవారు యిచ్చిన పదిహేనురూపాయలూ తన యింటిఖర్చు క్రింద వాడేసుకున్నాడు.

ఇంతలో నెలరోజులు పూర్తిఅయినై. గుఱ్ఱాలని తీసుకువెళ్లినవాళ్లు తమ తమ గుఱ్ఱాల్నితెచ్చి రాయలవారికి చూపుతున్నారు. రాయలు అందరి గుఱ్ఱాల్నీ పరీక్ష





ఆ ఖానుకి ఒక మూరెడు గడ్డంవుంది. ఖాను గుఱ్ఱాన్ని చూద్దామని కంతలో తల పెట్టాడు. అలా కంతలో తలపెట్టడంలో అతని గడ్డంకూడా కంతలోకి పోయింది. అసలే తిండికి మొహంవాచి వుందికదా! అందుకని సాహెబు గడ్డాన్ని కంతలో చూడగానే అది రోజూ రామలింగంపెట్టే గడ్డేమోననుకుని నోటితో గట్టిగా పట్టుకుంది. ఇక చూడండి, పాపం ఆ ఖాను తిప్పలు! కుయ్యో, మొఱ్ఱోమని చిందులు త్రొక్కటం మొదలెట్టాడు. కాని గుఱ్ఱం గడ్డాన్ని వదిలేనా! మేత లోపలికి రావటంలేదని మరింత గట్టిగా లాగటం మొదలెట్టింది. పాపం, ఖాను ఏడుపులు పెడబొబ్బలు లంకించుకున్నాడు. రామలింగం తమాషా చూస్తూ నుంచున్నాడు.



ఈ సంగతి ఆ వచ్చినవారిలో ఒకరు వెళ్లి రాయలవారితో చెప్పారు. వెంటనే రాయలవారువచ్చి ఖాను పడుతున్న అవస్థ కళ్లార చూశారు. ఒక కత్తెర తెప్పించి ఖానుగడ్డం తెగ్గోయించి విడిపించారు. తర్వాత గదితలుపు తీయించి చూశారు. గుఱ్ఱం, బక్కచిక్కవుంది. ఎముకలు పొడుచుకొచ్చి యిప్పుడో యింకా కాసే పటికో చచ్చేలాగుంది.

రాయలవారికి యిది చూసేసరికి తగని కోపంవచ్చింది. రామలింగంవంక గుడ్లెఱ్ఱ జేసిచూస్తూ "ఏమిటి రామలింగం ఈపని?" అని అడిగారు.

"అయ్యా, కళ్లారా చూస్తూనే నన్ను అడుగుతారు దేనికి? తిండీ నీళ్లూలేకుండా యిలా మాడ్చి చంపితేనే దీనికి యింత పొగరెక్క, పాపం, మనఖానుని యిలా ఏడిపించిందికదా! ఇక కడుపునిండా తిండి పెడ్తుంటే దీన్ని పట్టపగ్గాలుంటయ్యా!" అన్నాడు రామలింగం కొంచెంకూడా నదురూ బెదురూలేకుండా.

"అరి నీ అసాధ్యంమండా! ఇదటోయ్ నీపోషణ!" అని రాయలవారు పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వి వూరుకున్నారు. ఆ రోజే ఆ గుఱ్ఱాన్ని యింకొకరికి యిప్పించారు పోషణ చెయ్యమని.



పై చదరంమధ్యని ఒక యిల్లు వుంది. ఆ యింట్లో వున్నవారితో ఏదో పనుండి పొరుగూరి నించి ఎవరో కారులో వచ్చారు. వారికి అవూరు బొత్తిగా కొత్త. ఎలా వెడితే ఆయింటికి చేరుకోగలరో వాళ్లకి తెలియదు. మీకు తెలిస్తే వాళ్ళకి దారిచూపండి. మీరూ దర్జాగా కారులో వాళ్ళతోపాటు ఆ యింటిదాకా వెళ్ళిరావచ్చు. చక్కగా.

## ముగ్గులు



యస్. కమల, మద్రాసు.



పి. విమల, గుంటూరు.




## నాకు రెండు, మీకొకటి!

కోపల్లె యమునాబాయి, గుంటూరు.
కె. విజయలక్ష్మి, మద్రాసు.

ఒక ఊళ్లో ఇద్దరు మొగుడు పెళ్లాలుండే వాళ్లు. అమిత పిసినిగొట్టులు. తాము తినేవాళ్లుకారు, ఒకరికి పెట్టేవాళ్లుకారు.

ఇట్లా ఉండగా ఒకరోజు పెద్ద పండగ వచ్చింది. ఊళ్లోవాళ్ళంతా పిండిపంటలూ అవీ చేసుకుంటున్నారు. మనమొగుడు పెళ్ళాలు జన్మలో ఎన్నడూ పండగలు చేసుకుని ఎరగరు. "మనకేం పిల్లా, పీచా? పెద్దవాళ్ళకి పండగలేమిటి?" అనుకుని సరిపెట్టుకునేవాళ్ళు. కాని ఈసారిమాత్రం వాళ్లిద్దరికీ ఏదైనా తినాలని బుద్ధి పుట్టింది.

"మినపఅట్లు చేసుకుందాం. చౌకలో పోతుంది," అన్నది పెళ్ళాం. సరేనని మొగుడుబజారుకెళ్లి అరగిద్దెడుమినుములు పట్టుకొచ్చాడు. దానికి మరొక అరగిద్దెడు బియ్యంచేర్చి పెళ్ళాం అట్లు పొయ్యటానికి కూర్చుంది. రుబ్బితే ఎంతోపిండి కాలేదు. పెద్దఅట్లువేస్తే రెండే అవుతాయి. నాలుగు వెయ్యాలంటే మరీ చిన్నవవుతాయి. అందువల్ల పెళ్ళాం ఒకమాదిరి అట్లు మూడు వేసింది. ఇద్దరికీ చెరిఒకటీ పోగా మిగిలినది మొగుడు చూడకుండా తానే తినేద్దామనుకుంది. కాని మొగుడు పెనంచుంయి మనగానే వంటింటోవచ్చి కూర్చున్నాడు

"మూడు అట్లు వేశావు. ఇద్దరం ఎట్లా పంచుకుంటాం?" అన్నాడు.

"ఇదినాకూ, ఇదిమీకూ, ఇదినాకూ!" అంటూ పెళ్ళాం తనకు రెండు వచ్చేటట్టు పంచి చూపింది.

"అదెట్లా కుదురుతుంది? నేనుమొగుణ్ణి కనక ముందట్టు నాకువెయ్యి. రెండోఅట్టు నువ్వుతీసుకో. మూడోఅట్టు మళ్ళీ నావంతు వస్తుంది," అన్నాడు మొగుడు.

"అదేంమాట? న్యాయం ఉండాలి

మొదటి బహుమతి పొందిన పోటీవ్యాసం



పిండంతా చేతులు పడేట్టు రుబ్బినదెవరు? పొయ్యి రాజేసినదెవరు? పెనం కాల్చిన దెవరు? అట్లుకాల్చినదెవరు? అందుకని ముందుఅట్టూ, మూడోఅట్టూ నాకేరావాలి," అన్నది పెళ్ళాం.

"నీమొహం లాగుంది! నేనసలు కాలు గిద్దెడు మినుములేతెస్తేనువేం చేసేదానివి? డబ్బుపోసి అరగిద్దెడు తెచ్చినందుకు నాకురెండు రావాలి," అన్నాడు మొగుడు.

ఈవిధంగా కొంతసేపు మొగుడూ పెళ్ళాలు ఘర్షణపడ్డతర్వాత పెళ్ళాం ఒక ఉపాయం చెప్పింది.

"మనమిద్దరమూ కదలకుండా పడుకుందాం. ఎవరు ముందర కదులుతారో, ఎవరుముందు చప్పుడుచేస్తారో వారికి ఒక అట్టూ, రెండోవారికి రెండుఅట్లూ." అన్నది.

సరేనని ఇద్దరూ కదలకుండా పడుకున్నారు. ఊపిరికూడా విడిచిన చప్పుడు కూడా చెయ్యకుండా పడుకున్నారు. కళ్లు తెరుచుకునే ఉన్నారుగాని, పాపలు ఆడటంలేదు.

ఇట్లాఉండగా పొరుగింటి పుల్లమ్మ పిండి జల్లెడకోసంవచ్చి ఇంటావిణ్ణి పిలిచింది. జవాబులేదు. తలుపులు బార్లగా తెరిచి ఉన్నాయి. కాని ఎక్కడా మనిషి అలికిడి లేదు. వంటింటో అట్లు కనిపించాయి. ఇంకా లోపలికి వచ్చేసరికి మొగుడు పెళ్లా లిద్దరూ నిలువుగుడ్లుపడి నీలుక్కుపోయి కనిపించారు. పుల్లమ్మ వాళ్లని కేకలు పెట్టింది. జవాబులేదు. చచ్చారనుకుని పరిగెత్తుకుపోయి నలుగుర్నీ పిలిచింది.

అంతావచ్చి మొగుడుపెళ్లా లిద్దరూ చచ్చారని తేల్చుకున్నారు. ఇల్లంతాగాలించి మొగుడు పెళ్లాలు దాచుకున్న డబ్బుతీసి దహనానికి ప్రయత్నాలుచేశారు. బ్రాహ్మడు వచ్చి మంత్రాలు చదివాడు. ఇద్దరికీ స్నానాలు చేయించారు. పాడెకట్టారు.



ఇద్దర్నీ దానిమీదకట్టి శ్మశానానికి తీసుకుపోయినారు. కట్టెలమీద పెట్టారు. నిప్పు అంటించారు. ఇంత జరిగినా ఆ ఇద్దరిలో ఒకరూ కదలలేదు. శవంవెంట ముగ్గురు మాత్రమే వచ్చారు. శవం పూర్తిగా కాలినదాకా ఉండి ఇంటికిపోదామని వాళ్లుదగ్గిరే ఉండిపోయినారు.

మంటలు అంతకంతకీ దగ్గిరికి రాసాగాయి. పెళ్లాం చివాలున లేచి కూర్చుంది. ఇది చూస్తున్న మొగుడుకూడా చివాలున లేచి కూర్చుని "నువే ముందులేచావు. నేను రెండుతింటా, నువ్వొకటేతిను!" అని కేకపెట్టాడు.

అప్పటికే మసకచీకటిపడింది. మొగుడు పెళ్ళాలు చితిమీద లేచి కూర్చునేసరికి, కూడావచ్చినవాళ్లు దడిచుకున్నారు. వాళ్లిద్దరూ బ్రహ్మరాక్షసులైనారనీ, తమను తినటానికి వంతులు వేసుకుంటున్నారనీ అర్థం చేసుకుని పిక్కబలంకొద్దీ పారిపోయినారు.

మొగుడూ పెళ్ళాలిద్దరూ ఊళ్ళోకి పోదామని బయలుదేరారు. వాళ్లు ఊరి బయట చెరువుదగ్గరికి వచ్చేసరికి చాకలివాళ్లు వీళ్లిద్దర్నీచూసి దెయ్యాలై వస్తున్నారనుకుని గుడ్డలువదిలిపెట్టి పారిపోయారు.



పాపం అక్కడిదాకా వచ్చినతర్వాత ఈ మొగుడూ పెళ్ళాలకు ఊళ్ళోకి పోవటానికి భయంవేసింది, దెయ్యాలనుకుని చంపుతారేమోనని.

ఇక ఊళ్ళోవాళ్లు దెయ్యాలు వచ్చి ఊరిమీద పడతాయేమోనని హడలిపోతున్నారు. పైగా వాళ్ళకు తెల్లవారితే కట్టుకోటానికి గుడ్డలులేవు. అన్నీ చెరువుదగ్గరే దిగబడి పోయినై.

అయితే ఆవూరి కరణం మంచియుక్తిపరుడు. చల్లగా మోతాదు సాయిబును పిలిచి 'సాయిబూ, సాయిబూ! నీకు దెయ్యాలంటే భయంలేదుకదూ?" అన్నాడు.



"ఓ, నాకేయేమీ భయమూలేదూ !" అన్నాడు సాయిబు.

"అయితే చెరువుకుపోయి నాగుడ్డలు తెచ్చిపెడతావా ?" అని అడిగాడు కరణం.

"అదీ ఎంతపనీ !" అంటూ సాయిబు గుర్రాన్ని వేసుకుని బయలుదేరాడు.

సాయిబు చాకిరేవు చేరుకొని గుర్రాన్ని అక్కడ గాడిదను కట్టేమేకుకు కట్టివేసి చాకి బండలదగ్గరకు పోబోయాడు.

సాయిబు గుర్రం ఎక్కి రావటం మొగుడూ పెళ్ళాలూ చాకలిబాన చాటున కూర్చుని చూస్తున్నారు. సాయిబు దగ్గరికి రాగానే "గంయ్" అంటూ బానచాటు నుంచి ఒక్కసారి లేచారు.

ఇంకేం, సాయిబుకు గుండె పగిలి పోయింది. "అరే, సైతాన్ సంపే యేసింది" అని ఒక్కదూకున గుర్రంమీద పోయి పడ్డాడు. గుర్రంకూడా బెదిరి మేకుపెళ్ళ గించుకుని ఒక్క దూకు దూకింది. ఆ దూకుకు తాడును కట్టిఉన్న మేకువచ్చి, సాయిబు వీపుమీద కొట్టుకో సాగింది.

సాయిబు దెయ్యాలే కొట్టుతున్న వను కుని "అరే దెయ్యంగార్లూ ! మీకే సలాం సేస్తాం, మాకే వదలండి !" అంటూ తిరిగి చూడకుండా గుర్రాన్ని ఇంకా పరిగెత్తిం చాడు. పాపం సాయిబువచ్చి ఊళ్ళోపడిం దాకా ఆ మేకు దెబ్బలు తగులుతూనే ఉన్నవి. ఊళ్ళోవాళ్ళకి అంత భయంలో కూడా సాయిబును చూసేసరికి తగని నవ్వొచ్చింది.

చూశారా ? నిజానికి దెయ్యమనేది లేనే లేదు. అయినా ఊళ్ళోవాళ్లంతా ఊరకనే భయపడ్డారు.

ఇక మొగుడూ పెళ్ళాలు అర్ధరాత్రికి ఇంటికి చేరుకున్నారు. కాని అక్కడ ఇంటో ఏమీలేదు. ఉన్నవి కాసినీ ఊళ్లో వాళ్లు తలా ఒకటీ చేతపుచ్చుకుపోయారు. ఆ పీనాసి వాళ్లకి తగిన శాస్తిజరిగింది.









## ఆధారములు

### అడ్డము :

1. వేటాడు పిట్ట.
3. అరణ్యము.
5. సరస్వతీదేవి చేతిలోఉండును.
6. వంట విద్య.
8. ఈవిధముగా నవ్వుదుము.

0. దూషణ.

11. ఆవు—ఇచ్చును.
13. పుచ్చె.
15. శత్రుత్వము.
17. జిత్తులమారి జంతువు.
19. ఒక లోహము.
20. ఒక ధాన్యము.

### నిలువు :

1. వీడే (తలక్రిందులు).
2. విఘ్నేశ్వరుడు.
3. వేడి.
4. ఒక సంవత్సరము పేరు.
6. బిడ్డ.
7. సన్యాసులవద్ద ఉండును.
9. సమస్య.
12. వనములు (తలక్రిందులు)
14. సర్పము.
15. ఒక చెట్టు (తలక్రిందులు).
16. జబ్బుమనిషి.
18. రిక్క (తలక్రిందులు).



# చందమామ

## పోటీవ్యాసం

క్రిందటినెల పోటీవ్యాసాలలో మొదటి బహుమతిపొందిన "నాకు రెండూ - నీకొకటి!" అనే కథ ఈసంచికలో ప్రచురించాము. ఈ కథ యిద్దరు పంపారు.—
కోపల్లె యమునాబాయి, గుంటూరు.
కె. విజయలక్ష్మి, మదరాసు.

మొదటిబహుమతి 10 రూపాయలు వీరిద్దరికి సమంగా పంచాము.

### పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 దే | 2 గ | ■ | ■ | ■ | 3 కా | 4 వ |
| 5 వీ | ణా | ■ | 6 పా | 7 క | క | ళ |
| ■ | 8 ప | 9 క | ప | క | ■ | ■ |
| ■ | 10 తి | ట్టు | ■ | 11 పా | 12 లు | ■ |
| ■ | ■ | 13 క | 14 పొ | ల | ము | ■ |
| 15 వి | 16 కో | ధ | ము | ■ | 17 న | 18 క్క |
| 19 రా | గి | ■ | ■ | ■ | 20 వ | రి |

12 పేజిలోని చిక్కుమాటకు జవాబు
"భాగవతము"















# యువ ప్రచురణలు

మా ప్రచురణలు హిగిన్‌బాథమ్సు బుక్‌స్టాల్సులోనూ, వెంకట్రామా అండ్‌కో అన్ని బ్రాంచీలలోనూ, శేషు అండు కో, తెనాలి వారి వద్దనూ ఇంకా పెద్దపుస్తక విక్రేతలందరివద్దా దొరుకుతవి. లేనియెడల మాకు వ్రాయండి. 6-0-0 విలువగల పుస్తకములు ఒకేసారి తెప్పించినవారికి పోస్టు ఖర్చులు మేమే భరించిపంపుతాము.

## శరత్ బాబు వి

| | | |
|---|---|---|
| వాగ్దత్త | [నవల] | 1-12-0 |
| సుభద | ,, | 1- 8-0 |
| దేవదాసు | ,, | 1- 8-0 |
| పల్లీయులు | ,, | 1- 8-0 |
| నవవిధాన్ | ,, | 1- 0-0 |
| చంద్రనాథ్ | ,, | 1- 0-0 |
| పరిణీత | ,, | 0-12-0 |
| బడదీదీ | ,, | 0-12-0 |
| పతివ్రత | ,, | 0-12-0 |
| హేమాంగిని | ,, | 0-12-0 |
| నిష్కృతి | ,, | 0-12-0 |
| మావారు | ,, | 0-12-0 |
| కాశీనాథ్ | ,, | 0-12-0 |
| మహేశుడు | [కథలు] | 0-12-0 |
| నారీర్ మూల్య | [వ్యాసం] | 0-12-0 |
| సవిత | | 3- 0-0 |
| భైరవి | | 2- 8-0 |
| అరక్షణీయ | | 1- 4-0 |

## యువ బుక్ డిపో

గవర్నరుపేట
బెజవాడ




37, ఆచారప్పన్ వీధి
మద్రాసు

Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1



రాగిణీ వారి

# భక్త జనా

తమిళం

డైరెక్టర్.. పి. పుల్లయ్య బి.ఏ.

తారాగణం: శాంతకుమారి, నాగయ్య, హొన్నప్పభాగవతార్, సారంగపాణి మొదలైనవారు

ఆంధ్ర దేశానికి డిస్ట్రిబ్యూటర్లు:

వాహినీ పిక్చర్స్ లిమిటెడ్ :: మద్రాసు : బెజవాడ : తాడిపత్రి

PRINTED AT THE B. N. K. PRESS, 37, ACHARAPPAN ST. MADRAS - 1